

# అమెరికా పర్యటన
# వాజ్‌పేయి సాధించిన ఘన విజయాలు



- కొమరగిరి కృష్ణమోహనరావు

భారత ప్రధాని శ్రీ అటల్‌బిహారీ వాజ్‌పేయి అమెరికా పర్యటన విజయవంతమైనది అనటం ఏమాత్రం అతి శయోక్తి కాదు. ఇది వాస్తవం. ప్రతి ఒక్కరూ అంగీకరించ వలసిన నగ్నసత్యం. అమెరికా అధ్యక్షుడు క్లింటన్, ఆ దేశ రాజకీయనాయకులు, అక్కడి పత్రికలు ప్రకటించిన అభిప్రాయాలు కూడా పరిశీలిస్తే ఇదే వాస్తవము బహిర్గతం అవుతున్నది. భారతప్రధాని శ్రీ వాజ్‌పేయికి అమెరికాలో లభించిన అపూర్వ ఘనస్వాగతం కూడా ఇదే ఋజువు చేస్తున్నది. వాజ్‌పేయి, వైట్‌హౌస్‌వద్ద కారు దిగగానే, ఆయన మోకాలి నొప్పిని గమనించిన క్లింటన్ వెంటనే మరో నాలుగు మెట్లు దిగివచ్చి ఘనంగా స్వాగతం పలుకుతూ **"ప్రపంచంలోనే అతిపెద్ద ప్రజాస్వామిక ప్రధానిని వినమ్రంగా ఆహ్వానిస్తున్నాను. వాజ్‌పేయికి స్వాగతం పలకటం నాకు దక్కిన అరుదైన గౌరవం. వాజ్‌పేయి అమెరికా పర్యటనతో ఇరుదేశాలమధ్య సరికొత్త ఆశలు చిగురించాయి"** అని పలికిన క్లింటన్ పలుకులు వాజ్‌పేయి వ్యక్తిత్వానికి మచ్చుతునకలు. అమెరికా కాంగ్రెస్ ఉభయ సభలలో వాజ్‌పేయి చేసిన ప్రసంగం యావత్తూ అత్యంత ఉత్సాహభరితంగా కొనసాగింది. ప్రసంగం కొనసాగుతున్నంత సేపూ కాంగ్రెస్ సభ్యులు కరతాళధ్వనులతో హర్షం ప్రకటిస్తునే ఉన్నారు. ప్రసంగం పూర్తి అయ్యేలోపు సభ్యులు 21 సార్లు కరతాళధ్వనులు చేసి తమ హర్షామోదాలను ప్రకటించటం విశేషం. ఇరుదేశ సంబంధాలను గురించి ప్రస్తావించినప్పుడల్లా చప్పట్లు కొట్టారుట. వాజ్‌పేయి తన ప్రసంగంలో, హింసాత్మక తీవ్రవాదం వలన వచ్చే ఆపదలను గురించి వివరిస్తూ పాకిస్థాన్ దుష్కృత్యాలను ఈటెల్లాంటి మాటలతో తూర్పారబడుతూ **"పాక్‌తో మీకూ ముప్పే! కలిసిరండి! పాఠం చెబుదాం!"** అని అమెరికా కాంగ్రెసు సభ్యులకు పిలుపు యిచ్చారు. అమెరికా కాంగ్రెసును ఉద్దేశించి ప్రసంగించిన భారత ప్రధానులలో మూడవవారు వాజ్‌పేయి. గతంలో రాజీవ్‌గాంధి, పి.వి. నరసింహారావులు ప్రసంగించారు. 152 దేశాల ప్రతినిధులు పాల్గొనిన, అత్యంత ప్రతిష్ఠాత్మకంగా జరిగిన ఐక్యరాజ్య సమితి సహస్రాబ్ది సదస్సులో వాజ్‌పేయి మాట్లాడుతూ పాకిస్థాన్ సీమాంతర తీవ్రవాదాన్ని దుయ్యపడుతూ, భారతదేశంలో 30 వేలమంది అమాయకులను పొట్టన పెట్టుకున్న తీవ్రవాద వర్గాల వెనుక పాకిస్థాన్ హస్తమున్నదని, చారిత్రాత్మకమైన లాహోర్ శాంతి ఒప్పందాన్ని భ్రష్టుపట్టించింది పాకిస్థానేనని, పాకిస్థాన్ సీమాంతర తీవ్రవాదానికి వెన్ను కాస్తున్నంత కాలం ఆ దేశంతో భారతదేశం చర్చలు జరపటం అసాధ్యమని, అసంభవమని చెబుతూ, **"తీవ్రవాదం, శాంతి చర్చలు ఏకకాలంలో సాధ్యపడవు"** అని స్పష్టంగా చెప్పారు వాజ్‌పేయి. ఉగ్రవాద రక్కసిని మూలాలతో సహా నాశనం చేయడానికి, వాజ్‌పేయి పిలుపు యిచ్చిన, కొన్నిగంటలకే, ఐక్యరాజ్యసమితి సహస్రాబ్ది సదస్సు అంతర్జాతీయ ఉగ్రవాదాన్ని ఉమ్మడిగా మట్టుపెట్టాలని ప్రతిన బూనుతూ తీర్మానాన్ని ఆమోదించటం విశేషం. అణుపరీక్షలు జరిపితే తప్పేమిటి? దేశ భద్రతకు తమ ప్రభుత్వం ప్రథమ ప్రాధాన్యం ఇస్తుందని వాజ్‌పేయి స్పష్టం చేసినప్పటికీ, ఇదే మిషతో లోగడ భారత్‌పై అమెరికా ఆంక్షలను విధించింది. అయితే ఇప్పుడు అమెరికా కాంగ్రెసు, భారత్‌పై విధించిన ఆంక్షలన్నింటిని ఎత్తివేయాలని తీర్మానించడం వాజ్‌పేయి రాజకీయ చతురతకు విజయం కాదా? **"పెట్టుబడులతో రండి!"** అని అమెరికా వాణిజ్యవేత్తలకు వాజ్‌పేయి యిచ్చిన పిలుపుకు మంచి స్పందన వచ్చింది. అంతే కాదు, వాజ్‌పేయి అమెరికా పర్యటనలో ఇరుదేశాల మధ్య 600 కోట్ల డాలర్ల (రు. 27,300/- కోట్లు) విలువచేసే ఐదు భారీ వాణిజ్య ఒప్పందాలు కుదరటం భారత్-అమెరికా ఆర్థిక బంధంలో కొత్త అధ్యాయం మొదలైంది. సమగ్ర అణుపరీక్షల నిషేధఒప్పందం (సీటీబీటి) విషయంలో భారత్ ఎవరి వత్తిళ్ళకు లొంగబోదని ఉగ్రవాదాన్ని ప్రోత్సహిస్తున్న పాకిస్థాన్‌తో చర్చల ప్రసక్తేలేదని ధైర్యంగా, స్పష్టంగా అమెరికాలోనే ప్రకటించారు. మరియు ఐక్యరాజ్యసమితి భద్రతామండలిలో భారత్‌కు శాశ్వత సభ్యత్వం యివ్వాలని స్పష్టం చేసి, భారతదేశ కీర్తి ప్రతిష్ఠలను ఇనుమడింపజేశారు వాజ్‌పేయి.

ఇక పత్రికల ప్రశంసలు, అమెరికా నేతల ప్రకటనలను పరిశీలిస్తే, వాజ్‌పేయి రాజకీయ చతురత ఎట్టిదో స్పష్టమవుతుంది. **"వాజ్‌పేయి అమెరికా పర్యటన ఉభయదేశాల మధ్య మారుతున్న సంబంధాలకు అద్దం పడుతుంది. ఆర్థిక రాజకీయ**

తరువాయి 30వ పేజీలో......

అక్టోబరు 2000
సంపుటి 16 సంచిక 10

మేనేజర్
కొమరగిరి చంద్రశేఖర్
24-52, రామానాయుడుపేట,
మచిలీపట్నం - 521 001.
© 22818, 21137

Cheques & Drafts should be drawn in favour of "*SREEVANI*" Monthly Machilipatnam

Edited, Printed and Published by
***Komaragiri Krishna Mohan Rao***

| | | |
|---|---|---|
| సాధారణ సంచిక | : | 5-00 |
| సంవత్సర చందా | : | 60-00 |
| 4సం॥ల చందా | : | 225-00 |
| జీవిత సభ్యత్వం | : | 600-00 |
| పోషకులు | : | 1,116-00 |
| రాజపోషకులు | : | 5,116-00 |
| మహారాజపోషకులు | : | 10,116-00 |
| ఓవర్సీస్ చందా (4 సం॥లకు) | : | 50 $ |

*Printed at*
**SREEVANI OFFSET PRINTERS**
MACHILIPATNAM

*Despatched on*
**9-10-2000**

# శ్రీవాణి
## సాంస్కృతిక మాసపత్రిక

సంపాదకులు : కొమరగిరి కృష్ణమోహనరావు

## విషయసూచిక



ముఖచిత్రం
**సోదరి నివేదిత**



# అమృతవాణి



శ్లో॥ 'పిత్త్రజ్వరార్శః,క్షయ,గుల్మ,శూల
శ్లేష్మాది,రోగోదిత, తీవ్రదుఃఖం
దుర్గంధ,మస్వాస్థ్య,మనూనచింతాం
విచార్య,కోవా,విరతిం నయాతి?'

ప్రతి మనిషి శరీరము ఆరోగ్యంతో వుండాలంటే వాతపిత్తశ్లేష్మాలు మూడు సమానస్థాయిలోవుండాలి. ఈ త్రిగుణాలు ప్రకోపించకుండావున్నంతకాలం శరీరానికి ఏ రోగమూ రాదు.

వాతపిత్తశ్లేష్మగుణాల్లో ఏ ఒక్కటి ఎక్కువై ప్రకోపించినా ఆ గుణానికి సంబంధించిన వ్యాధులన్నీ ఒకదానివెనుక మరొకటివచ్చి శరీరాన్ని పీడిస్తాయి. పడుచుతనంలో వీటిని తట్టుకొనే సామర్థ్యం శరీరానికి వుంటుంది. కాని ముసలి తనం వచ్చేసరికి ఈ మూడు గాడితప్పి విజృంభిస్తాయి. ఒక్కొక్కటి విజృంభించినపుడు దానికి సంబంధించిన అనేక రోగాలు శరీరాన్ని ఆవరించి పీడిస్తాయి. ఇలా మూడు గుణాలకు కావలసినన్ని రోగాలు వెంటవున్నాయి. శరీరంలో ఏ రోగంవచ్చినా అది ఈ మూడింటిలో దేనికోదానికి సంబంధించిందని తెలుసుకోవాలి.

అయితే ముసలితనంలో వీటి తాలూకు రోగాలు వస్తే అవి నయంకావటం చాలా కష్టం. కారణం శరీరం బలహీనమై వుంటుంది కనుక. రాజుగారు చతురంగబలాలతో గొప్పగా బలపడి వున్నప్పుడు ఏ శత్రురాజు అతనిపైకి దండెత్తి రాలేడు. కాస్త బలహీనపడితే చాలు శత్రువులు అతనిపై లంఘించి హతమారుస్తారు.

అసలే శరీరం రోగాలయం. పైగా ముసలితనం వచ్చి పడింది. ఇక చెప్పేదేముంది? "రోగాశ్చ శత్రవ ఇవ ప్రహరంతి దేహం" మాటిమాటికి జ్వరం వచ్చి పీడిస్తుంది. అత్యుష్ణం వల్ల మూలశంక ఏర్పడుతుంది. క్షయరోగం వస్తుంది. గుండె దడ పెరుగుతుంది. కడుపులో పోట్లు ప్రారంభమవు తాయి. కఫం గుండెనిండా చేరి కంఠావరోధం కలిగిస్తుంది. చివరికి కృష్ణా రామా అని కూడా అనుకొనే యోగ్యత వుండదు. మలమూత్రాదిస్తంభనం జరుగుతుంది. తినాలనిపించదు. తింటే యిమడదు. చివరికి ఔషధం పోసినా శ్లేష్మం వల్ల మింగలేని దుర్భరస్థితి యేర్పడుతుంది. శరీరంలో ఒక విధమైన దుర్గంధం బయలుదేరుతుంది. దాంతో పరిచర్య చేయడానికి తన వాళ్ళు సయితం విసుక్కొంటారు. వినరానిమాటలు పడాల్సి వస్తుంది. దాని వల్ల వృద్ధుడు చింతాక్రాంతుడు కాక తప్పదు. దైవచింతనం లేకపోగా జీవితం గురించిన చింత పెరిగి మానసికంగా కూడా పీడిస్తుంది. ఇంత దురంత దుఃస్థితి వూహించుకుంటే వైరాగ్యం పుట్టదా? వార్ధక్యంలో శరీర దుర్భర స్థితిని తల్చు కొన్నప్పుడు సమాజంలో అలాంటి వ్యక్తుల్ని చూస్తున్నప్పుడు బుద్ధిమంతుడైన మనిషికి తప్పక విరక్తి కలుగుతుంది.


**కూచిభట్ల చంద్రశేఖరశర్మ**

# సోదరి నివేదిత
## (మార్గరెట్ నోబుల్)

నవయుగాన మానవచరిత్రలో 19వ శతాబ్దం ప్రత్యేకించి పేర్కొనదగ్గది. ఆ శతాబ్ది ఆరంభ దశకాలంలో, తిరిగి మరల ఆ శతాబ్ది ఉత్తరార్ధంలో ఈ దేశంలోనేకాక ప్రపంచంలోనే మానవజాతి జీవనాన్ని ప్రభావితం చేయ గలిగిన చరిత్రను సృష్టించిన ఎందరో రాజకీయవేత్తలను, విజ్ఞానశాస్త్రజ్ఞులను, సాహితీవేత్తలను మినహాయించి సాంస్కృతికంగా, ఆధ్యాత్మపరంగా మానవజాతికి మహోపకారం చేసివెళ్ళిన మహనీయులెందరో ఆ కాలంలో ఉద్భవించారు. వారిలో ఈశ్వరచంద్ర విద్యాసాగరుడు, దయానంద సరస్వతి, షిర్డిసాయిబాబా, బ్లావట్స్కీ, రామకృష్ణ పరమహంస, మహదేవ గోవిందరానడే, అనీబి సెంట్, కేశవకార్వే, స్వామి వివేకానంద, మహాత్మాగాంధి మొదలగువారు ప్రాతఃస్మరణీయులు. వీరందరూ సనాతన మానవధర్మ విలువలను, విశిష్టతను మరల లోకానికి చాటిచెపుతూ, ఆ అనుసరించదగిన ధర్మమార్గాన తాము స్వతః జీవించి వెళ్ళినవారు, పుణ్యధనులు. వీరిలో స్వామి వివేకానందుడు ప్రత్యేకించి ఎన్నదగిన మహనీయుడు. ఆయన హిందువుల సనాతన ధర్మ ఆశయాలకు మూర్త రూపం. (Embodiment of Ideals) ఆ ఆశయాలను మానవ ప్రపంచానికి ప్రప్రథమంగా చాటిచెప్పిన యశోధనుడు. ఆ ప్రజ్ఞామూర్తి తన ప్రపంచ పర్యటనలో ఎందరో మేధావంతుల నాకర్షించాడు. వారి జీవితాలను మానవసేవకంకితమై పోయేట్లు వారిని ప్రభావితం చేశాడు. ఐరోపా, అమెరికా దేశాలలో ఎందరో సంపన్నులను స్త్రీ - పురుష వివక్షత లేకుండా తన శిష్యులుగా మార్చుకున్నాడు. వారిని వేదాంత ధర్మనిష్ఠాపరులుగా మార్చాడు. సేవా పరాయణులుగా తీర్చిదిద్దాడు. అట్టి వారిలో జె.జె. గుడ్విన్, సి.సి. ఎవరెట్, డోయిసన్, మేరీలూయిస్, మిస్.యస్.ఇ. వేల్డో, సెవియర్ దంపతి, ఇ.టి. స్టర్డీల్, మిస్ మార్గరెట్ నోబుల్ అనువారలు ముఖ్యంగా పేర్కొనదగినవారు. గత శతాబ్ది చివరిలో వేదాంత ధర్మబోధనలో అంశంగా స్వామి వివేకానంద ప్రబోధించిన యీ పరమ సూత్రం - Work into death - This life comes and goes - wealth, fame, enjoyment, are only for a few days. It is better, for better to die on the field of duty, preaching the truth than to die like a worldy worm. వారందరినీ అద్భుతంగా ఆకట్టుకుంది.

**విదుషీమణి**

మార్గరెట్ నోబుల్ - యీమె వివేకానందునికి శిష్యురాలై సిస్టర్ నివేదితగా తన పేరును మార్చుకున్న విదుషీమణి, సంస్కారవంతురాలు. ఈమె 1867 సం॥ అక్టోబర్ 28న ఐర్లండు దేశంలోని బెల్‌ఫాస్టు (Belfast) నగరంలో జన్మించింది. తల్లి ఉపాధ్యాయిని, తండ్రి క్రైస్తవ మతప్రచారకుడు. డబ్లిన్, లండన్ నగరాలలో ఉన్నత విద్య నభ్యసించింది. స్వామి వివేకానందుడు 1893 సెప్టెంబరులో

**డా॥ చలసాని సుబ్బారావు**

అమెరికాయందు చికాగో నగరంలో జరిగిన నాటి విశ్వధర్మ సమ్మేళనంలో అద్వైత వేదాంత హిందూయతిగా పాల్గొని, తన అద్వితీయ వాక్పటిమతో ప్రపంచంలో క్రైస్తవ మతమునకు మించిన మతములింకావున్నవని పశ్చిమ దేశాలకు చాటిచెప్పి తద్వారా ఆ దేశాలయందలి తాత్వికులు, కళాకోవిదులు, మతాచార్యుల మన్ననలందుకొన్నాడు. వారి ఆహ్వానంపై స్వామి నాలుగు సంవత్సరాలపాటు పాశ్చాత్య దేశాలలో పర్యటించి వారికి వేదాంత దర్శన సిద్ధాంతాలను తెలియచెప్పాడు. ఆ కాలంలో ఒక పర్యాయం ఆంగ్లేయుల కోరికపై వివేకానందుడు 1895 సెప్టెంబరులో లండన్ నగరానికి వెళ్ళి మూడు మాసాలపాటు అద్వైత దర్శనం, మాయావాదం, యోగదర్శనం, ఆత్మతత్త్వం, మానవ సేవయే మాధవసేవ అను అంశాలపై చక్కటి ప్రసంగా లిచ్చాడు. ఆ లండన్ ప్రసంగాలకు ముగ్ధులైన వారిలో సిస్టర్ నివేదిత, మాక్సుముల్లర్ సుప్రసిద్ధులు.

**నివేదితగా ఇండియా వచ్చింది.**

వివేకానందుడు లండన్ వెళ్ళునాటికి మార్గరెట్ నోబుల్ లండన్‌లో ఒక పాఠశాలను నిర్వహిస్తుంది. అప్పటికామె వయస్సు 28 సం॥లు. మానవ జీవన ధర్మాలను గూర్చి

లక్ష్యాలను గూర్చి ఆయన ఉపన్యాసాలు విని ముగ్ధురాలై ఆయన ననుసరించింది. ఆనాటి నుండి 7 సం॥ల కాలం ఆమె వివేకానందుని మార్గంపై జీవించింది. వివేకానందుడు పరమపదించిన తదుపరి మరి 9 సం॥లపాటు ఆయనకు శిష్యురాలిగానే భారతీయులకు తన సేవలనందించింది. ఆమె భారతీయులను తన ఆత్మీయులుగా, భారతదేశాన్నొక పవిత్రమైన ఆధ్యాత్మస్థలి (Spiritual Home) గా భావించింది. 1897లో వివేకానందుడు పాశ్చాత్య దేశాలలో తన మొదటి పర్యటన ముగించుకొని భారతదేశానికొచ్చినప్పుడు మార్గరెట్ నోబుల్ నివేదితగా ఆయనతోపాటు భారతదేశమొచ్చింది. గాంధీజీకి మీరాబెన్‌వలె, అరవిందునికి బారారిచర్డ్‌వలె, వివేకానందునికి నివేదిత అంతేవాసియై (Disciple) విశ్రాంతినెరుగని ఆయన జనసేవా కార్యక్రమాలకు పూర్తిగా సహకరించడం జరిగింది. వారితోపాటు తమతమ సర్వస్వాలను త్యజించి స్వామికి శిష్యులై భారతదేశం వచ్చిన సెవియర్ దంపతులు కూడ వున్నారు. వారు ఉత్తర దేశంలోని పర్వత ప్రాంతమైన అల్మోరా వద్ద స్వామి ఆశీస్సులతో అద్వైత సేవా ఆశ్రమాన్నొక దానిని స్థాపించుకొని ధన్యులైనారు. వారితోపాటు నివేదిత కొంతకాలం ఆశ్రమంలో ధ్యాన సాధన చేసింది.

### దివ్యకుసుమం

నివేదిత తన సుఖస్వార్థాలను తృణప్రాయంగా భావించి జీవితాంతం బ్రహ్మచారిణిగానుంటూ సత్య శోధనలో మహాత్ముల అడుగుజాడల కొరకు ఆరాటపడు మనస్తత్వం కలది. ఆమెకు వివేకానందుని లండన్ ఉపన్యాసాలు దివ్యస్ఫూర్తినందించాయి. వివేకానందుని పట్ల, ఆయన జన్మించిన భారతదేశంపట్ల, భారతీయుల పట్ల తనకు కలిగిన దివ్యానుభూతిని గురించి ఆమె యిలా అన్నది. "వడజెందిన వానికి నిర్మలోదకం వలె, భక్తునకు భగవంతుని సందర్శనంవలె, ఆకలిగొన్న వానికి మృష్టాన్నం వలె మాలో అనేకులకు స్వామి వచనములఖండశాంతి నొన గూర్చినవి. మాలో పెక్కుమంది చిరకాలంగా నమ్ముతూ వస్తున్న క్రైస్తవ మత ప్రబోధాలపై స్వామివారి వేదాంత దర్శనం వెలుగును ప్రసరింప చేసింది. అంధకారమున బడి, వున్నదారిని మరచిన మాకు స్వామివారి వేదాంత జ్యోతి ఆనాడు మార్గదర్శకమై ప్రకాశించింది".

వివేకానందుని లండన్‌యాత్రలో తనకభిమానులుగా మారిన మాక్సుముల్లర్ వంటి మహాపండితులుకాక త్యాగధనులైన మరి నలుగురు మహనీయులు ఆయనకు ప్రియశిష్యులుగా రూపొందడం ఒక మహత్తర సంఘటన. ఆ నలుగురు జె.జె. గుడ్విన్, సెవియర్ దంపతులు, సోదరి నివేదిత. ఈ నలుగురు వివేకానందుని ఆదర్శాల కొరకు తమ వారిని, తమ సంపదలను వదులుకొని భారతదేశం వచ్చిన ధీమంతులు. వీరిని వివేకానంద పశ్చిమ దేశాలలోని తన వేదాంత ఉద్యానవనంలో పుష్పించిన దివ్యకుసుమాలన్నాడు.

Lay down your comforts, your pleasures, your fame or positions, may even your lives, make a bridge of human chains over which millions will cross this ocean of life. లండన్ నగరంలో ఒక బహిరంగ సమావేశంలో స్వామి పూరించిన యీ శంఖారావం ఆనాటి యువక హృదయాలను కదలించి వేసింది. సోదరి నివేదిత యీ సందేశాన్ని మనసారా నమ్మింది. తన జీవితాన్ని మానవజాతి తరించేందుకొక సాధనంగా తీర్చిదిద్దింది.

### మానవసేవయే మాధవసేవ

నివేదితగా మార్గరెట్ నోబుల్ వివేకానందునితోపాటు 1897 జనవరిలో భారతదేశం చేరుకొంది. కొలంబో నుండి మధుర, తిరుచిరాపల్లి, కుంభకోణం మొదలగు పట్టణాల మీదుగా మద్రాసు చేరుకొని అచట 9 రోజులుండి ఫిబ్రవరి మాసంలో కలకత్తా నగరం చేరుకొంది. ప్రతిచోట వివేకానందునికి లభించిన అపూర్వ స్వాగత సత్కారాలకు ముగ్ధురాలైంది. కలకత్తాలో శ్రీరామకృష్ణ పరమహంస

"పలుశాస్త్రములలోన పటిమ చూపగవచ్చు
గండర గండలై క్రాల వచ్చు
రాజ్యాధినేతలై ప్రజల నేలగవచ్చు
దాతృత్వ గరిమతో తనర వచ్చు
సాచివ్య భారంబు సవదరింపగ వచ్చు
సృష్టి క్రమంబు గుర్తింప వచ్చు
రిక్కల నికరమ్ము లెక్కింపగా వచ్చు
రేరాజుపై సంచరింప వచ్చు
కవితలల్లి కీర్తి కనవచ్చు మనవచ్చు
భోగ భాగ్యములను తూగ వచ్చు
మదిని నిలువరించు మార్గమెన్నరినాడు
పగ్గెలెల్ల బుగ్గిపాలు గావె"

- తాళ్లూరి సత్యనారాయణ

జన్మించి సంచరించిన స్థలాలను దర్శించి ధన్యురాలైంది. స్వామి వివేకానంద తన అభిమానులైన శ్రీ రామకృష్ణ భక్తులతో లోకకళ్యాణార్థం భారతదేశంలో వినూత్న సన్యాస సంప్రదాయాన్ని నెలకొల్పవలెననుకొన్నప్పుడు సోదరి నివేదిత ఆయనకు పలువిధాల సహకరించింది. ఆనాటి వివేకానందుని ఆలోచనే గంగానది ఒడ్డున బేలూరులో 1897లో శ్రీ రామకృష్ణ సేవాసమితి (Sri Rama Krishna Mission) గాను, మరియు 1898లో శ్రీ రామకృష్ణ మఠం గాను రూపుదిద్దుకొంది.

సోదరి నివేదిత విశుద్ధ సన్యాసిని, పరమ నిష్ఠాపరురాలు. భారతీయ ఋషి సాంప్రదాయం ప్రకారం ఆమె సన్యాసాశ్రమ విధులను పాటిస్తూ బేలూరు వద్ద గంగానదీ తీరాన ఒక కుటీరం నిర్మించుకొని మరికొందరు ఆంగ్ల వనితలతో కలసి నివసిస్తూ భారతీయుల కొరకు పాటు పడింది. స్వామి వివేకానందుని యీ సేవాసూక్తి It is a Privilege to serve mankind, for this is the worship of God. ఆమె హృదయాన్ని, మనస్సును ఆకట్టుకొంది. భారతీయ విజ్ఞానం నిరుపమానమైనదని, విలక్షణమైనదని గుర్తించి, త్యాగం, సేవానిరతి, కర్తవ్యనిష్ఠ, సద్వర్తన పరమార్థాలుగా సన్యాసం స్వీకరించి ధార్మిక జీవనం గడిపింది. శ్రీ రామకృష్ణ మిషన్ ఆశయాలైన మానవ ధర్మ విధులను ప్రజలలో వ్యాప్తిజేయుట, అనాథలనాదరించుట, దీనులకు సహకరించుట, ఆశ్రమాలను, సంఘాలను స్థాపించి వేదాంత తత్త్వమును ప్రచారం చేయుట, నిర్మలమైన ఆధ్యాత్మిక ప్రవృత్తిని ప్రజల కలవడజేయుట, మొదలగు వాటి కొరకు అహర్నిశలు తపించింది. మనిషికి పరమావధి అయిన మోక్షం తానొక్కడే కోరక నలుగురితో పాటు అది తనకు లభించే వరకు కొన్ని జన్మలెత్తవలసి వచ్చినా అందుకు సిద్ధపడిన వివేకానందుని మహదాదర్శాన్ని సోదరి నివేదిత మనసారా నమ్మి, అందుకు చిత్తశుద్ధితో కృషి చేసింది. వివేకానందుడు బోధించినట్లుగా ఆమె అర్థరహితమైన బాహ్యాచారాలకు (Meaningless Rituals), అంధ విశ్వాసాలకు (Supersitition) ప్రాముఖ్యమివ్వక గృహస్థులైనా, సన్యాసులైనా 'మానవ సేవయే మాధవసేవ' అను ఆదర్శాన్ని లక్ష్యంగా తీసికొని జీవించాలని చెప్పింది. ఆమె అలాగే జీవించింది. ఆమెను దేశంలో హిందువులు భారతీయులు తమలో ఒక మనిషిగా గుర్తించి ఆదరించారు.

### మరొక అనిబిసెంట్

బేలూరు మఠం వద్ద సోదరి నివేదిత నిర్వహించిన బాలికా పాఠశాల జీవనాదర్శాలకు నిలయమై విద్యాసాగర్, రానడే, కార్వే, అనిబిసెంటు, ఆశుతోషముఖర్జీ వంటి పండితుల ప్రశంసలకు పాత్రమైంది, గాంధీజీ, మీరాబేన్‌ల నాకర్షించింది. వివేకానందుడు తన ఆశయాలనలా ఒక ఆంగ్ల వనిత నిర్వహించిన పాఠశాలలో సాకారమై వెలుగు నందుకొనడం తనకు గర్వకారణమని చెప్పుకొనేవాడు. ఆధునిక భారతదేశపు విద్యావిధానంలో వేదాంత విద్యకు తగిన స్థానముండవలెనని కోరిన స్వామి వివేకానందుడు తన శిష్యురాలు నెలకొల్పిన పాఠశాలలో ఆ ఆధ్యాత్మవిద్య (Spiritual Education) కు తగిన వాతావరణమేర్పడడాన్ని హర్షించాడు. నిజంగా తన త్యాగభరితమైన, సేవానిష్ఠగల జీవనం ద్వారా నివేదిత తనను మరొక అనిబిసెంటుగా నిరూపించుకొంది. ఎందువలనంటే ఈ దేశంలో పుట్టిపెరిగిన వ్యక్తులు ఈ దేశం కొరకు తన శక్తియుక్తులను వినియోగించడంలో, అది మంచిపని అయినా, అందులో విశేషముండదు. మరొక దేశంలో పుట్టి, అందులోను ఆనాటి పాలకులైన ఆంగ్లేయులకు సంబంధించిన వ్యక్తులు యిచ్చటకు వచ్చి యీ దేశాన్ని తమ దేశంగా భావించి యీ దేశం కొరకు తమ సర్వస్వాలను త్యజించడమనేది నిజంగా అద్భుతమైన విషయంగానే పరిగణించాలి. సోదరి నివేదిత అలా తన సర్వస్వాన్ని భారతీయుల కొరకు వెచ్చించిన మహనీయురాలు.

### జ్ఞానదీపిక

జండాకొక కర్రవలె, లెటరుకొక చిరునామావలె, భవనానికొక పునాదిరాయివలె సోదరి నివేదిత స్వామి వివేకానందుని విశ్వజనీన జీవితాన్ని కన్నివిధాల సహకరించిన వ్యక్తులలో ఆమె నిజంగా అగ్రగణ్యురాలని చెప్పాలి. శిష్యుల కోరికపై స్వామి 1899 జూన్ మాసంలో మరొకసారి అమెరికా వెళ్ళిన సందర్భంలో నివేదిత స్వామి ననుసరించింది. అచ్చటాయన ఉపన్యాసాలను రికార్డు చేసింది. ఆయన చెప్పిన భారతీయ సనాతన ధర్మ వైశిష్ట్యాన్ని భద్రపరచి పెట్టింది. ఆమె ఆనాడు భద్రపరచి పెట్టిన విలువైన విషయాలతో 'The master as I saw him' అను గ్రంథాన్ని రచించి లోకానికిచ్చింది. స్వామి వివేకానంద పరమపదించిన 4 జులై 1902 తరువాత సోదరి నివేదిత 9 సంవత్సరాలు ఆయన ఆదర్శాలకు రాణింపునిస్తూ జీవించింది.

స్వామి వివేకానందుని మార్గదర్శకత్వంలో నివేదిత శ్రీరామకృష్ణుని ఆశయాలతోపాటు పతంజలి రాజయోగం, విదురనీతి వంటి భారతీయ గ్రంథాలనాదరించింది. ఆ మహనీయుల ఆశయాల కనుగుణంగా తన జీవితాన్ని స్వచ్ఛందంగా, నిరాడంబరంగా మలచుకొంది. ఒక విధంగా ఆమె తన 44 సం॥ల జీవితాన్ని విజ్ఞానసమ్మతమైన సనాతన భారతీయత కంకితం చేసిందని చెప్పుకోవాలి.

మానవుని ప్రజ్ఞాప్రాభవాలకు, పరమార్థాలకు సత్యనిష్ఠయే పరమాధారమను ఋషి ప్రబోధాన్ని - Truth is the foundation of all merit and Virtue - నమ్మి అందుకు తన జీవితాన్ని మనసావాచాకర్మణా జ్ఞానదీపికగా రూపొందించిన సోదరి నివేదిత స్థితప్రజ్ఞురాలు, ధన్యురాలు.



# పురుష సూక్తము 16

*వేదాహమేతం పురుషం మహాంతం*
*ఆదిత్య వర్ణం తమసస్తు పారే ।*
*సర్వాణీ రూపాణీ విచింత్య ధీరః*
*నామాని కృత్వాఽభివదన్ యదాస్తే ॥*

**అర్థం :**

| | |
|---|---|
| **యత్ ధీరః** | : ఏ ధీర పురుషుడు |
| **సర్వాణీ రూపాణీ కృత్వా** | : సర్వరూపాలను చేసి |
| **విచింత్య** | : బాగుగా యోచించి చింతన చేసి |
| **నామాని** | : అన్వర్థ నామాలుంచి |
| **అభివదన్ ఆస్తే** | : పిలుచుటకు అనుకూలము చేశాడో |
| **ఏతం మహాంతమ్** | : అట్టి ఈ మహాత్ముని |
| **ఆదిత్య వర్ణమ్** | : ఆదిత్య వర్ణం గలవానిని |
| **తమసః తు పారే** | : పెంజీకటి కావలగలవానిని |
| **పురుషమ్** | : సత్య సనాతన పురుషోత్తముని |
| **అహమ్** | : నేను |
| **వేద** | : తెలుసుకొనగలిగాను |

**వ్యాఖ్య :**

పరమేశ్వరుడు అత్యంత ధీ వైభవశాలి., ధీరాతి ధీరుల తలదన్నినవాడు. అంతటివాడు మరొకడు లేడు. ఆ స్వామి బ్రహ్మదేవుడై సర్వజీవులనూ, జీవుల రూపాలనూ, జీవుల భావాలనూ, స్వభావాలనూ సృష్టిచేశాడు. చేస్తున్నాడు. అంతమాత్రమే కాక జీవుల భేదాలను బట్టి తగిన నామాలు నిర్ణయించాడు. ఆ నామాలతో తాను పలికించి చూచాడు. జీవులు అర్థం చేసుకొని పలుకుతున్నారు. జగత్సృష్టి జేగీయమానంగా తాను అనుకొన్నట్లు నిరాటంకంగా సాగిపోతోంది.

అట్టి పరమాత్మను నేను చూచాను. తెలుసుకో గలిగాను. ఎరుగుదును. ఆ స్వామి ఆదిత్యవర్ణ శోభితుడు. మహత్తేజోమూర్తి. ఆదిత్యవర్ణం అంటే ప్రణవాక్షరం. స్వామి ఓంకార మూర్తి. స్వామి సత్య సనాతనుడు. పురాణ పురుషోత్తముడు. దివ్య జ్యోతిర్మయ మూర్తి. చిన్మయ మూర్తి. ఆ ప్రభువు పెంజీకటి కావల వెలుగుతున్నాడు. స్వామికీ నాకూ గల తెర తొలిగిపోయింది. 'తానువేరు జగత్తువేరు' అనే తమస్సు విడిపోయింది. భిన్నభావం తమస్సు. అభిన్నం మహస్సు. అది బ్రహ్మవర్చస్సు. జగతి ప్రకృతి మండలం ప్రకృతి తమస్సు. ఈ తమస్సుకు ఆవలిది పరమ పురుష నిలయం. అది దేవాలయం. మహి మాలయం. హిరణ్మయం. చిన్మయం. అది స్వామి చేత మనః ప్రజ్ఞ కల్గిగి దివ్యస్ఫురణ కలిగింది. పెంజీకటి కవ్వల ఏకాకృతిగా వెలుగువాడు పరమేశ్వరుడు.

ఆ స్వామిని తెలియటం అంటే తాదాత్మ్య స్థితియే 'త్వమేవాహం' అనే స్థితి. స్వామి చరుడు-అచరుడు. కర్త-అకర్త. సక్రియుడు-నిష్క్రియుడు. సాకారుడు-నిరాకారుడు. ఏదీకానివాడు-సర్వమూ తానైనవాడు. తానే సర్వ లోకాలను, సర్వభాషలను, నామాలను నిర్ణయిస్తాడు. 'ఇలా ఉచ్చరించాలని' బోధిస్తుంటాడు. ఆ జగత్స్వామి మహాత్ముడు, సర్వాంతర్యామి, బ్రహ్మాండ మంతటా నిండి ఉన్నాడు. అట్టివాడు మరొకడు లేడు. ఆ స్వామి ప్రభాకరుడు. ప్రణవస్వరూపుడు ద్వైతభావం, దైన్యభావం లేని దైవభావం గలవాడు. ఆ స్వామి సర్వాంతర్యామి. ఆ స్వామినే 'అహంవేద'.



# 'ప్రవృత్తి' మార్గమును విసర్జించాలి! 'నివృత్తి' మార్గంలో ప్రవేశించాలి!



"పునర్విత్తం పునర్మిత్రం
పునర్పత్ని పునర్భూః
యావత్సర్వం పునర్లభ్యం
న శరీరం పునః పుః"

ప్రేమస్వరూపులారా!

ఈ ప్రాకృతమైన జగత్తునందు, ఈ భౌతికమైన జగత్తునందు, ఈ అనిత్యమైన జగత్తునందు అన్నియూ వస్తుంటాయి, పోతూఉంటాయి. ధనము మానవునకు లభిస్తుంది, క్షణంలో వీడిపోతుంది. మిత్రులుకూడనూ జీవితంలో అనేక మంది కలుస్తూంటారు, వీడిపోతుంటారు. పత్నులు కూడనూ చేరుతుంటారు, వీడిపోతుంటారు. యశస్సు కూడా వస్తుంది,పోతుంది. కాని ఒక్క తూరి శరీరం పోయిందంటే, తిరిగి అది మనకు లభించదు. కనుక మానవ శరీరం వుండినంతలోనే మానవతావిలువలను పోషించు కొని, తద్వారా మానవత్వాన్ని సార్ధకం గావించుకోవాలి.

**'అనిత్యం జీవనం లోకే**
**అనిత్యం యౌవనం ధనం**
**అనిత్యం బంధుమిత్రాది**
**సత్యం ధర్మం ద్వయం స్థిరమ్'**

మానవునకు ఏనాటికైనా, ఏజన్మమునకైనా, ఏలోకమునందైనా వీడిపోనటువంటివి సత్యధర్మాలే. ఇట్టి సత్యధర్మములు ప్రాచీన కాలము నుండి భారతీయ సంస్కృతిని పోషిస్తూ వస్తున్నాయి. సర్వపురాణములు, సర్వ శాస్త్రములు 'సత్యంవద, ధర్మంచర ' అని ఈ రెండింటినే ప్రధానంగా ప్రబోధిస్తున్నాయి. అయితే ఈనాడు మానవులు వీటిని విస్మరిస్తున్నారు. పవిత్రమైన మానవతావిలువలను గుర్తించుకొనలేక కాలమును వ్యర్థంగావిస్తున్నాం. మానవ జీవితాన్ని నిరుపయోగం చేస్తున్నాం.

మానవజీవితం అంటే ఏమిటి? కేవలం పుట్టటం, పెరగటం, సుఖాలను అనుభవించటం, మరణించటం - ఇదియా మానవజీవితలక్ష్యం? వీటిని పశు పక్షి మృగాదులు కూడా అనుభవిస్తూనే ఉన్నాయి. ఇది కాదు. మానవుడు ప్రత్యేకమైన ఆదర్శమును నిరూపించాలి. మానవత్వాన్ని ఉద్ధరించాలి. 'ఉద్ధరేదాత్మనాత్మానం ' అని గీత బోధిస్తున్నది. ఆత్మోద్ధరణ నిమిత్తమై మానవత్వం ప్రాప్తించింది గాని, కేవలం పశు పక్షి మృగాదులవలె జీవించ డానికికాదు. ఇట్టి పవిత్రమైన జ్ఞాన సుజ్ఞానములను ప్రబోధించే నిమిత్తమై **'గణపతి' అవతరించాడు. 'గ' అనగా బుద్ధి. 'ణ' అనగా విజ్ఞానము. ఈ రెండింటికి అధిపతి అయినవాడే 'గణపతి' సురలోకానికి అధిపతి 'గణపతి'.** జ్ఞానవిజ్ఞానాదులను

## భగవాన్ సాయి హితబోధ

బోధించి, దివ్యత్వమైన ఆనందాన్ని జగత్తుకు అందించాడు 'గణపతి'. గణపతికి మించిన నాయకుడు మరొకడు లేడు. అతనే మహానాయకుడు. అట్టి నాయకత్వాన్ని వహించినటు వంటి గణపతి తత్వాన్ని గురించి వేదకాలం నుంచి ప్రబోధ ప్రచారాలు జరుగుతూనే ఉన్నాయి. ఋగ్వేదము, తైత్రోపనిషత్తులలో కూడా ఈ గణపతి తత్వాన్ని గురించి చక్కగా వివరించబడింది. 'తన్నో సర్వః ప్రచోదయాత్' అన్నారు. మానవత్వంలో దివ్యత్వమనేది ప్రకాశిస్తునే ఉంటుంది. అయితే ఇట్టి దైవత్వాన్ని మనం ఈనాడు విస్మరిస్తున్నాము. ఇట్టి ప్రబోధ, ప్రకాశములను అందించేటటువంటి దైవత్వాన్ని విస్మరించి, దీనత్వాన్ని వహించి, మానవత్వాన్ని హీనం గావించు కుంటున్నాం. ఈ అనిత్య, అశాశ్వతములైటువంటి ప్రాకృత వస్తువుల కోసం ప్రాకులాడుతూ, నిరాశ నిస్పృహలకు గురియై, అశాంతులపాలై, మానవత్వాన్నే విస్మరిస్తున్నాం.

మానవుడు సాధించవలసినది, నేర్వవలసినది, లౌకిక విద్యలు కాదు, భౌతిక శక్తులుకాదు, అనిత్యమైన ఆనందం అంతకన్నా కాదు. ఇవన్నీ క్షణభంగురమైనటువంటివే. అలాంటి అనిత్యమైనటువంటి, అశాశ్వతమైనటువంటివాటి కోసం, విలువైనటువంటి, బలమైనటువంటి 'మానవతా

విలువల'ను మనం ఈనాడు కోల్పోతున్నాం. ప్రవృత్తి మార్గము నుండి లభించినవన్నీ అనిత్యములు, అశాశ్వతములే. నివృత్తి తత్త్వమును మాత్రమే అనుభవించి, ఆనందించి, పదిమందికి అందించాలి. కనుక ప్రవృత్తిని మాత్రమే ఆధారంగా గైకొనకుండా, నివృత్తిని కూడా ఆధారంగా తీసుకోవాలి. ఈ జగత్తులో ఏది సత్యమైనది? ఏదీ సత్యమైనటువంటిది లేదు.

**'దేహము పాంచ భౌతికము దేహము కూలక తప్పదెప్పుడున్**
**దేహి నిరామయుండు గణుతింపగ దేహికి చావు పుట్టుకల్**
**మోహ నిబంధ బంధనల ముద్రలు లేవు నిజంబు చూడ**
**దేహియె దేవదేవుడు మదిన్ గణుతింపగ ఆత్మరూపుడే'**

కాని, దేహమునే సత్యముగా భావించుకొని, దేహిని విస్మరించి, మన కాలమును కూడా మరచిపోతున్నాం. భగవంతుడు అందించిన వరప్రసాదములలో 'కాలము' చాలా ప్రధానమైనటువంటిది. అయితే అట్టి కాలమును విలువ లేకుండా చేసుకుంటున్నాం, వ్యర్థం గావించు కుంటున్నాం. కాలమును వ్యర్థం గావించుకుంటున్న మానవుడు, ఇక కాయమును ఇంకా ఎంత వ్యర్థం గావించుకుంటున్నాడో! కాయమును పవిత్రం గావించు కొనే నిమిత్తమై, కాలమును సార్ధకం చేసుకోవాలి. కాల కర్మకారణ కర్తవ్యాలు కలసి వచ్చినప్పుడే, మానవత్వం దివ్యత్వాన్ని పొందుతుంది. అనేక ఉపనిషత్తు పురాణ ఇతిహాసశాస్త్రములు మానవత్వాన్ని గురించి ఎంతగానో వర్ణిస్తూ వచ్చాయి. కాని వాటిని అర్థం చేసుకోవటంలేదు. ఆచరణలో అంతకన్నా పెట్టడంలేదు. కేవలం గ్రంధాలను మాత్రమే పఠిస్తున్నారు. కాని, ఆచరణలో పెట్టటంలేదు.

గణపతి తత్త్వమనేది సర్వులకూ 'పతి' (నాయకత్వ) తత్త్వాన్ని బోధిస్తున్నది. ఈ నాయకత్వం లోపలవున్న గొప్పతనాన్ని మనం గుర్తించాలి. ముఖ్యంగా గణపతి సర్వులకూ నాయకుడు. ఈ వినాయకచవితి శుభదినాన భారతీయులు అనేక విధములైన పిండి వంటలు చేసుకొని, గణపతికి నైవేద్యం పెట్టటం మన సంప్రదాయం. కొంత బియ్యంపిండి తీసుకొని, దీనిలో కొంత నువ్వుల పిండి కలిపి ఆవిరిలో ఉడకబెట్టి, ఉండ్రాళ్ళు చేసి, గణపతికి నైవేద్యం పెడుతారు. ఇది ఆరోగ్యమునకు, ఆనందమునకు ఇది ఒక ఆదర్శంగా నిరూపిస్తూ వచ్చింది. ఆవిరిలో ఉడకబెట్టిన ఈ పదార్థము కన్నులకు ఆరోగ్యము నిస్తుంది. ఉబ్బస వ్యాధులను నివారిస్తుంది. అయితే ఈనాడు ఆరోగ్య ఆనందములను అందించేటటు వంటి, ఇట్టి ఆహారమును విస్మరిస్తున్నాం, విసర్జిస్తున్నాము. భగవంతుని యొక్క తత్త్వము ప్రతి ఒక్కటీ, కారణములేని కార్యంగా ఉండదు. కాని మానవుడు ఈనాడు ఈ సత్యమును గుర్తించుకొనలేక, కేవలం భౌతికమైన వాటిల్లో కాలాన్ని గడుపుతున్నాడు. ఇది సరియైనటువంటిదికాదు. గణపతి పండుగ ఉత్తమమైన ఆరాధన. కేవలం మానవులకే కాదు, పశుపక్షి మృగాదులకు కూడనూ, ఈ పండుగ చక్కటి ఆదర్శమును అందిస్తున్నది. ఇలాంటి పవిత్రమైన దినమును మనం ఈనాడు అపవిత్రం గావించుకుంటున్నాం.

మానవుని యందు రెండు విధములైన గుణములు కనిపిస్తున్నాయి. 1. పశులక్షణం 2. పశుపతి లక్షణం. అయితే ఈనాడు మనం పశుపతి లక్షణమును విస్మరించి, పశులక్షణాలనే మనం దృష్టియందుంచుకొని కాలమును చాలా దుర్వినియోగం గావించుకుంటున్నాం. ఈనాడు చదివే చదువులు, నేర్చిన తెలివితేటలు అన్నీ తలనుంచి ప్రారంభమైనటువంటివే. ప్రతి సైంటిస్టు తల నుంచి వచ్చినటువంటివాటికే ప్రాధాన్యత యిస్తున్నాడు. ఇది 'మేధాశక్తి' అని భావిస్తున్నాడు. ఈ మేధాశక్తి అంతయూ కేవలం 'ప్రవృత్తి' లక్షణాలే. ఇవి లోక సంబంధమైన విషయాలను మాత్రమే క్రోడీకరించగలవు. కాని హృదయ తత్త్వము ఎప్పటికీ నిత్యసత్యమైనటువంటిది. దయ, ప్రేమ, కరుణ, సత్యము, సహనం, సానుభూతి - ఇత్యాది సద్గుణములన్నీ హృదయము నుండే ఆవిర్భవిస్తాయి. ఇది

'నివృత్తి' లక్షణం. ఇట్టి 'నివృత్తి' లక్షణాలను ఏమాత్రం అభివృద్ధి పరచుకోవటానికి మనం ప్రయత్నించటంలేదు. మానవుడు తెలివితేటలను పెంచుకోవటానికి ప్రయత్నిస్తున్నాడే కాని, సద్గుణాలను పెంచుకోవటానికి ప్రయత్నించడంలేదు. తెలివితేటలను పెంచుకొని, దివ్యత్వాన్ని విస్మరించి, దానవత్వంలో ప్రవేశిస్తున్నాడు. భగవద్గీత 'అనిత్యం అసుఖంలోకం' అన్నది. ఇక్కడ సుఖంలేదు. ఇది నిత్యసత్యమైనటువంటిదికాదు. అనిత్యమూ, అసుఖమూ అయినటువంటి ఈ జగత్తునందు జన్మించినావు గనుకనే, ఈ జన్మను సార్థకంగావించుకొనే నిమిత్తమై, ఈ 'ప్రవృత్తి' మార్గమును విసర్జించి, 'నివృత్తి' మార్గంలో ప్రవేశించాలి. అయితే ఈనాడు మహనీయులు అనబడే వారందరూ లోకసంబంధమైన విషయాలను మాత్రమే బోధిస్తున్నారు గాని, హృదయ సంబంధమైన వాటిని బోధించడంలేదు. ఏమున్నది దీనిలోగొప్పతనం? ఇంతకాలం నీవు అనుభవించిన దానిలో 'కించిత్' అయినా నీవు శాంతిని పొందావా? శాంతి... శాంతి... అంటారు. అసలు శాంతి ఎక్కడ ఉన్నది?

"హస్తమున అణుబాంబులుంచుక
అరచుచుండ్రు శాంతి శాంతి యనుచు
చంద్రుచేరగ గలిగికూడనూ
చెందజాలరు శాంతి సుఖములను"

శాంతిమనయందే ఉంటున్నది. శాంతి నీ స్వరూపమే. అట్టి శాంతిని పొందడానికి బయట ప్రపంచంలో వెదకనక్కరలేదు. బయట వెదికేవన్నీకూడనూ అశాంతికి లక్షణాలే. ఈ ప్రాకృత జగత్తులో కనిపించేటటువంటి సమస్తములూ అనిత్యములే.

*ప్రేమస్వరూపులారా!*

ప్రేమకు మించిన బలం వేరొకటిలేదు. ఇటువంటి బలమైన ప్రేమ మీయందువుంచుకొని కూడనూ, దానిని మరచిపోయి, పిచ్చిమార్గంలో ప్రవేశించి, మీ జీవితాలను వ్యర్థం గావించుకుంటున్నారు. ప్రాకృతమైన ఈ శాంతి అసలు శాంతికాదు. పరతత్త్వంతో కూడిన శాంతి, సత్యమైన శాంతి. అదియే.... "నిర్గుణం, నిరంజనం, సనాతనం, నికేతనం, నిత్యశుద్ధబుద్ధముక్త నిర్మల స్వరూపిణం". ఇలాంటి శాశ్వతమైన తత్త్వాన్ని బోధించే నిమిత్తమై 'గణపతి' ఆవిర్భవించాడు. సర్వగుణములకూ అధిపతి 'గణపతి'. సర్వసద్గుణములకూ అధిపతి 'గణపతి'. ఇలాంటి సద్గుణములు కలిగిన గణపతిని మనం దుర్వినియోగం గావించుకుంటున్నాం. పరుల చింతనలో కాలమును వ్యర్థం గావించుకుంటున్నాం. పరులను గురించి తేలికగా మాట్లాడుకుంటున్నాం. పరులందరూ పరమాత్మ స్వరూపులే. 'పరులు పరులుకాదు పరమాత్ముడగునయా!'. అందరినీ దివ్యత్వంగా మనం భావించుకోవాలి. అందరి యందున్న 'ఆత్మతత్త్వము' ఒక్కటేనని విశ్వసించాలి. '**ఈశావాస్యమిదం జగత్**' అని భావించాలి. సర్వత్రా కనిపించేటటువంటిది భగవత్ తత్త్వమే. "**దేహో దేవాలయ ప్రోక్తో జీవో దేవస్సనాతనః**". ఈ దేహమనే దేవాలయము నందు జీవుడనే దేవుడు సర్వులయందూ ఉంటున్నాడు. కనుక మనం ఏ దేహమును దర్శించినప్పటికినీ అందులో 'దేహి' అనే జీవతత్త్వమును ఆనందంగా గుర్తించాలి. ఒకరిని ద్వేషించడం, మరొకరిని ప్రేమించడం ఉండ కూడదు. కనుక దైవత్వాన్ని ఏకత్వంగా మనం భావించాలి. "**ఏకాత్మ సర్వభూతాంతరాత్మ**". ఆ సత్యమును గుర్తించు

## ధర్మవ్యాధోపాఖ్యానము

"వ్యభిచారాన్నరేంద్రాణాం
ధర్మః సంకీర్యతే మహాన్
అధర్మోవర్ధతే చాపి
సంకీర్యంతే తతః ప్రజాః"

రాజుల యొక్క చెడు నడత వల్ల ధర్మసాంకర్య మేర్పడుతుంది. అధర్మం వృద్ధి పొందుతుంది. ప్రజల్లో వర్ణసాంకర్యం కలుగుతుంది.

"భేరుండా వామనాః కుబ్జాః
స్థూలశీర్షాస్త దైవచ
క్లీబాశ్చాంధాశ్చ బధిరా
జాయంతేఽ త్యుచ్చలోచనాః"

అట్టి స్థితిలో భయంకరమైన ఆకారం కలవాళ్ళూ, పొట్టి వాళ్ళూ, గూనివాళ్ళూ, లావైన తల కలవాళ్ళూ, నపుంసకులూ, గుడ్డివాళ్ళూ, చెవిటి వాళ్ళూ, చాలా ఎత్తైన కండ్లు వాళ్ళూ జన్మిస్తారు.

కొనినప్పుడు 'అశాంతి' అనేది మనల్ని వెంటాడదు. నిరంతరమూ శాంతి సుఖములతో జీవించగలము.

ఈనాడు లోకంలో అనిత్యమూ, అశాశ్వతమైనటు వంటి వాటికి కూడా ఎన్నో ఆరాధనలు సలుపుతుంటారు. ఎవరెవరి కర్మకు వారు నమస్కరిస్తుంటారు. అదియే ఉపనిషత్తు యొక్క సారము. 'చిత్తస్యశుద్ధయే కర్మః'. ఒక డ్రయివరు కారులో ఎక్కి మొట్టమొదట స్టీరింగ్‌కు నమస్కారంచేసి, కారును స్టార్ట్ చేస్తాడు. నర్తకి నాట్యంచేసేముందు కాలి అందెలకు నమస్కారం చేసి, వాటిని కాళ్ళకు కట్టుకొని నాట్యం చేస్తుంది. గీతను చదవడానికి ముందు, దానిని తెరచి మొట్టమొదట నమస్కారంచేసి, దానిని చదవటం మొదలు పెడుతారు. దీని అంతరార్థమేమిటి? ఈ సంప్రదాయములు ఎందుకు పెట్టారు? దేని నిమిత్తమై వీటిని ఆచరిస్తూ వచ్చారు? ప్రారంభమునకు పూర్వమే భగవంతునికి తన మనసును అర్పితం చేయాలని, భగవంతునికి నమస్కరించి కార్యములో మనం పాల్గొనాలనే పవిత్రభావం వారిలో ఉండడమే. విజ్ఞానరహితులైనవారే ఈ విధంగా ప్రవర్తిస్తుంటే విజ్ఞానవంతులమని చెప్పుకొనే సైంటిస్టులకు మాత్రం ఈ జ్ఞానం లేకుండా పోతున్నది. ఈనాడు ఎవడు జ్ఞాని.... జ్ఞాని.... అని భావించుకుంటున్నాడో, వాడే పరమ అజ్ఞానిగా తయారవుతున్నాడు. మనం నడుస్తుంటే, మన నీడ మన ప్రక్కనే నడుస్తూ వస్తుంటుంది. అదేవిధముగనే, మనం జ్ఞానవంతులమని విర్రవీగుతుంటే, మన ప్రక్కన 'అజ్ఞానము' అనే నీడ నడుస్తునే ఉంటుంది. జ్ఞాన, అజ్ఞానముల రెండింటి చేరికే మానవత్వం. కనుక నేను గొప్ప జ్ఞానిని అనుకోవటం చాలా పొరపాటు. జ్ఞానము ఎంత ఉందో, అంత అజ్ఞానము కూడా నీ వెంట వస్తూనే ఉంటుంది. మనం ఏది చేస్తున్నా, ప్రక్కన అజ్ఞానం ఉంటూనే ఉంటుంది. దీని నుండి తప్పించుకొని పోవాలంటే, సర్వమునూ జ్ఞానమయంగా భావించుకోవాలి.

**'సర్వం విష్ణుమయం జగత్'.** ఇదే ఉపనిషత్తులు బోధించినటు వంటిది. అంతా దైవస్వరూపమే. దైవము కానటువంటిది ఈ జగత్తులో ఏమీలేదు. దీనిని పురస్కరించుకొనియే త్యాగరాజు **'చీమలో, బ్రహ్మలో, శివకేశవాదులలో ప్రేమమీర వెలుగుచుండు బిరుదు వహించిన రామా! నన్ను బ్రోవరా!".** కనుక చీమ మొదలు బ్రహ్మ వరకు దైవత్వమే ఉంటున్నది. అలాంటి దైవత్వాన్ని ఈనాడు మరచిపోతున్నారు. ఆధునిక విద్యలు నేర్చినకొద్దీ, సత్సంప్రదాయాలకు తిలోదకాలిస్తున్నారు. పెద్దలను చూచినప్పుడు నమస్కరించాలనే గుణం కూడా లేకుండా పోతున్నది. తల్లిదండ్రులను, పెద్దలను, గురువులను గౌరవించాలనేటటువంటి సద్గుణములన్నీ ఈనాడు మారిపోతున్నాయి. అలాంటి సద్బోధలు గావించే నిమిత్తమై వినాయకుడు వచ్చాడు.

మనం భజనలు చేస్తున్నాం, గానం పాడుతున్నాం. దేని నిమిత్తమై చేస్తున్నాం? దానిని గుర్తించటంలేదు. శ్రుతి, తాళం, రాగముల మీదనే మన మనసు పోతున్నది. శ్రుతి, లయ, రాగ, తాళములు ఉండవలసిందే. నిజంగా హృదయపూర్వకంగా ఆ భగవత్ ప్రేమను నీ హృదయములో నింపుకొనినప్పుడు, శ్రుతి, లయ, రాగ, తాళములు వాటంతట అవే నీలో ప్రవేశిస్తాయి. నీవు 'ట్యూన్' పైననే దృష్టిని పెట్టుకుంటే, భావం పాడైపోతుంది. కనుక భగవంతుని యొక్క తత్త్వమును అందులో ఇముడ్చుకొని

## శాంతిధర్మ ప్రదాయి! శ్రీసత్యసాయి!

"పరమాత్మ కృష్ణుండు బాసటగా నున్నఁ
బాండవు లిక్కట్లు పడయలేదె
నియమనిష్ఠలతోడ నిఖిలేశుఁ బూజించు
నంబరీషుఁ డిడుమ లందలేదె
తనుమన ధనములన్ దాశరధి కొసంగి
గోపన్న కష్టముల్ కుడువలేదె
నిధికంటె రామసన్నిధియె మేలని పల్కి
త్యాగయ్య యాతనలందలేదె
పూర్వజన్మల కర్మల పూర్ణఫలము
ననుభవింపక తప్పదా యజునికైనఁ
బసిఁడి యగ్నిని కాల్చిన వన్నె పెరుగు
శాంతి ధర్మప్రదాయి! శ్రీ సత్యసాయి!

- కొలచన వెంకట రమణమూర్తి

పోవాలి. నీ మనస్సే భగవత్‌మయం కావాలి. అగ్నిలో పడవేసిన ఇనుపముక్క కూడా అంతా అగ్నిగానే మారిపో తుంది. దానిని ముట్టుకుంటే కాలుతుంది. పాలలో నీరుపోస్తే, నీరంతా పాలగానే కనపడుతాయి. రెండుగా విభజించడంకాదు, ఒకటిగా ఏకం చేయాలి. అదే మన పవిత్ర భారతీయ సంస్కృతి. అనేకత్వంలో ఏకత్వాన్ని నిరూపిస్తూ వచ్చింది. కనుక అన్నింటియందున్న ఏకత్వాన్ని మనం గుర్తించాలి. అట్టి ఏకత్వాన్ని గుర్తించినవాడే నిజమైన మానవుడు.

మనం ఏ పనులు చేసినా సరే దైవమునకు ప్రీతికరమైన పనులను చేయాలి. మనం చేసే పనులను భగవంతుడు మెచ్చుకుంటాడా? లేదా? అని విచారణ చేసి, భగవంతునికి ఇష్టమైన పనులనే మనం చేయాలి. అప్పుడు నీవు చేబట్టిన కార్యాలు విజయమునే సాధిస్తాయి. అయితే ఈనాడు ఎవరి ఇష్టమును వారు చూచుకుంటున్నారేగాని, భగవంతుని అభీష్టాన్ని మాత్రం చూడటంలేదు. ఇది మంచిదికాదు. దైవము యొక్క ఇచ్ఛకు తగ్గట్లుగా మనం నడుచుకోవాలి. దైవమునకు ప్రీతికరమైన పనులనే చేయాలి. స్వార్థమును ప్రక్కనపెట్టాలి. గణపతి 'సిద్ధి, బుద్ధి' తత్త్వాన్ని బోధించాడు. మంచి బుద్ధి మనకుంటే, సిద్ధి మనకు లభిస్తుంది. కనుక దివ్యత్వాన్ని అనుభవించాలంటే, 'సిద్ధి, బుద్ధి' ఉండాలి. కనుక మనం హృదయపూర్వకంగా భగవంతుని ప్రార్థించి మానసికంగా భగవంతుని ప్రేమించి, మన హృదయమును, దైవత్వానికి అంకితం చేయాలి. అప్పుడు మనం చేసే కార్యం స్వల్పమైనా, అధికంగా రూపొందుతుంది.

*ప్రేమస్వరూపులారా!*

దైవత్వాన్ని మనం పొందాలనుకుంటే నిర్మలమైన ప్రేమ ఒక్కటిచాలు. అష్టోత్తర నామావళి చదవనవసరం లేదు. సహస్రనామావళి చేయనవసరంలేదు. ఇవన్నీ పేరు ప్రతిష్ఠలకు మాత్రమేకాని, సేవకు మించిందిలేదు. సేవయే చాలా గొప్పది. **"నతపాంసి న తీర్థానాం న శాస్త్రాణి జపానహీ సంసార సాగరోద్ధారే సజ్జనం సేవనం వినా".** ఇది తపస్సు వలన లభించేటటువంటిదికాదు. తీర్థయాత్రల వలనగాని, శాస్త్రాలు చదవటంవలనగాని, జపతపాదులవలనగాని సంసార సాగరమును దాటలేము. సజ్జనుల సేవవలననే సాధించవచ్చును. ఎవరికి సేవచేసినా, దైవసేవగానే భావించండి. చాలామంది పూజలే ప్రధానమనుకుంటారు. అదే ప్రధానమని మిగతా అన్ని పనులూ మానుకుంటారు. అది చాలా పొరపాటు. పూజలు ప్రధానమే. ఏది పూజ? మార్కెట్ నుంచి తెచ్చిన పూలతో చేసేది పూజకాదు. హృదయ పుష్పాన్ని భగవంతునికి సమర్పించాలి. **అహింస, ఇంద్రియ నిగ్రహం, సర్వభూత దయ, క్షమ, శాంతి, తపస్సు, ధ్యానము, సత్యం** అను ఎనిమిది పుష్పములను భగవంతునికి సమర్పించాలి. అప్పుడే భగవంతుడు మనల్ని అనుగ్రహిస్తాడు.

ద్రౌపది ఎట్టి పరిస్థితులలోను కృష్ణుని మాటలను ఉల్లంఘించేటటువంటిదికాదు. అలాంటి పతివ్రతామ తల్లులు, ఈ పవిత్ర భారతావనిలో ఉండటంచేతనే భారతదేశము ఈనాటికీ ఎంతో క్షేమాన్ని అనుభవిస్తున్నది. కనుక క్షమాభావము ప్రతి మానవునికి అత్యవసరం. అప్పుడే క్షమారూపంలో సాక్షాత్కరిస్తాడు దైవము. ఈ గణపతి పండుగ కూడనూ క్షమాతత్త్వాన్ని బోధించి, ప్రేమ తత్త్వాన్ని ప్రకటింపచేసి, దివ్యతత్త్వాన్ని ఆచరింపజేసి, ఆనందాన్ని అనుభవింపజేసేటటువంటిది.

(ది. 1-9-2000న వినాయకచవితి శుభదినాన భగవాన్ సాయి ప్రశాంతి నిలయంలో చేసిన దివ్యప్రసంగం నుండి)

# కోట్లాది సంవత్సరాలనాటి జీవాల పునఃసృష్టి సాధ్యమేనా?

జూరాసిక్ పార్క్ సినిమా ఆ రోజుల్లో పెద్ద సంచలనాన్ని సృష్టించింది. అందులోని రాక్షస బల్లులు (డైనోసార్‌లు) అట్టహాసం చూసి హడలిపోయిన వారెందరో ఉన్నారు. నూరు అడుగుల పైనుండే ఆ రాక్షసజీవాలు ఐదు కోట్ల సంవత్సరాల క్రితం భూమిపై తిరిగాయట. ఉన్నట్లుండి వాటి జాతి అంతరించింది. ఇలా ఎందుకు జరిగింది? ఐదుకోట్ల సంవత్సరాల క్రిందట ఒక తోకచుక్క భూమిని గుద్దుకుందని, అది సృష్టించిన విధ్వంసంలో వీటి జాతి సమూలంగా అంతరించిందని ఒక సిద్ధాంతం. విచిత్ర మేమిటంటే ఇవి గ్రుడ్లను పెట్టేవి. శిలాజాలుగా మారిన వాటి గ్రుడ్లు ఇప్పటికీ ప్రపంచమంతటా ఎన్నో చోట్ల కనిపిస్తూ ఉంటాయి. మన దేశంలోని గుజరాత్ రాష్ట్రంలో ఇవి అత్యధికంగా కనిపిస్తాయి. వీటిని శివలింగాలుగా భావించి పూజలు చేస్తుంటారా స్థానికులు. ఇటీవల అమెరికాలో శిలాజాలుగా మారిన కొన్ని డైనోసార్ గ్రుడ్ల నుంచి కణాలను సేకరించి క్లోనింగ్ ప్రక్రియ ద్వారా డైనోసార్‌ల పునర్ సృష్టి చేయడానికి ప్రయోగాలు జరుగుతున్నాయి.

ఒక్క డైనోసార్‌లే కాదు. కోట్లాది సంవత్సరాల క్రిందట బృహత్ రూపాలుగల జంతువులే కాదు, రెక్కల పాములు, జూలు వున్న ఏనుగులు ఇలా ఎన్నోరకాలు ఉండేవి. జూలు వున్న ఏనుగులు తిరిగి భూమి మీద సంచరిస్తే! ఆ అద్భుత సన్నివేశం రాగల అవకాశాలు కనిపిస్తున్నాయి. ధృవాల దగ్గర ఎన్నో మైళ్ళ ఎత్తున మంచు పేరుకుని ఉంటుందన్న విషయం తెలిసినదే. అయితే ధృవాలు ఎప్పుడూ మంచులో కప్పబడి లేవు. ఒకప్పుడు అక్కడ ఉష్ణమండల అరణ్యాలు ఉండేవి. ఇందుకు కారణం భూమి ఉపరితలం నెమ్మదిగా పైనుంచి క్రిందికి తిరుగుతుంది ఈనాటి ఉత్తర ధృవం ఒకప్పుడు భూమధ్య రేఖమీద, తర్వాత ఇప్పటి దక్షిణ ధృవం దగ్గర ఉండేది. అలాగే ఇప్పటి దక్షిణ ధృవం ఒకప్పుడు భూమధ్య రేఖ మీద తర్వాత ఉత్తర ధృవం దగ్గర ఉండేది. ఈ ప్రక్రియ కొనసాగుతూనే ఉంటుంది. ఉష్ణ మండలాలలో కోట్లాది సంవత్సరాలకు ముందు జూలున్న ఏనుగులు సంచరిస్తు ఉండేవి. తర్వాత హిమప్రళయం సంభవించి వందల అడుగుల ఎత్తున్న మంచు పేర్కొనిపోయి ఎన్నో జంతువులు అంతరించాయి. ఆ తర్వాత ఈ ప్రాంతం ఉత్తర ధృవం వైపున దిగిపోయింది. అయితే మంచులో కూరుకుపోయి నందువల్ల ఎన్నో జంతువుల శరీరాలు భద్రంగా ఉండిపోయాయి.

ఇటీవల కజువ్యామిగోటె, ఆకరా ఇరిటాని అనే జపాన్ శాస్త్రజ్ఞులు సైబీరియాలోని నదీ పరీవాహక ప్రాంతంలో మంచుపొరల్లో భద్రంగా ఉండిన ఒక జూలువున్న ఏనుగు శరీరాన్ని కనుగొన్నారు. దాని వీర్యకణాలను, ఇతర కణాలను, డి.ఎన్.ఏ. తో సహా భద్రంగా జపాన్‌లోని ప్రయోగశాలకు జేర్చారు. ఆ వీర్యకణాలలోని క్రోమోజోమ్‌లు మరో కణంతో ఫలదీకరణంచెంది, మరో హైబ్రిడ్ ప్రాణిని సృష్టించగలవా లేదా అన్న విషయం నిర్ధారణ చేసుకోడానికిగాను కొన్ని వీర్యకణాలను ఎలుక అండంలోకి ప్రవేశపెట్టారు. ఇక్కడ ఫలదీకరణం జరిగితే (టెస్ట్ ట్యూబ్ బేబీలులాగ) ఏర్పడిన అండాన్ని ఒక ఆడ ఏనుగు శరీరంలో ప్రవేశపెట్టారు. వీర్యకణంలోని ఎక్స్ క్రోమోజుమ్ ఫలదీకరణంలో భాగం పంచుకుని వుంటే పుట్టే సంకర ప్రాణి ఆడది అవుతుంది. అదే కనుక జరిగితే ఈ మొదటి దశలో దాని పూర్వీకుల లక్షణాలను కొంత వరకూ అందుకున్న ఈ ఆడప్రాణులు రెండవ దశగా మరోసారి జూలు ఏనుగుల వీర్యకణాలను ప్రవేశపెట్టడం ద్వారా హిమయుగం నాటి జూలు ఏనుగులను సృష్టించవచ్చునని ఈ శాస్త్రవేత్తలు విశ్వసిస్తున్నారు. అయితే మొదటి దశలో జన్మించిన ఏనుగు ఎంతవరకు ప్రత్యుత్పత్తి అంగాలను కలిగి వుంటాయనేది తేలవలసిన విషయం. ఎందుకంటే ఈ తరహా ప్రయోగాలను గాడిదలు, గుర్రాలపై చేసినప్పుడు వాటి సంతానం పునరుత్పత్తి అంగాలు లేకుండా జన్మించాయి. అదే ప్రయోగాన్ని చిత్తడి నేలలు, నదీ ప్రాంతాల్లో తిరుగాడే గేదెలపై చేసినప్పుడు వాటి క్రోమోజోముల సంఖ్యలో తేడా వున్నా పరిపూర్ణ ఆరోగ్యం కలిగిన పిల్లలకు జన్మనిచ్చాయి. జపాన్ శాస్త్రజ్ఞులకు లభించిన జూలు ఏనుగు సైబీరియాలోని నదీ పరీవాహక ప్రాంతం లోనిది కనుక, ఇది కూడా ఆ గేదెలకు లాగానే పరిపూర్ణమైన, ఆరోగ్యవంతమైన జూలు ఏనుగుకి జన్మ నియ్యవచ్చునన్న ఆశాభావంతో ఉన్నారు. అదే జరిగితే కోట్లాది సంవత్సరాల గత చరిత్ర ప్రత్యక్షమవుతుంది.

- కె.ఆర్.కె. మోహన్



# ప్రశాంతి నిలయంలో గణేశ చతుర్థి మహోత్సవములు

ఆ రోజు సెప్టెంబరు 1. వినాయక చవితి పర్వదినం. ప్రశాంతినిలయంలోని నార్త్ ఇండియన్ క్యాంటీన్ ఎదురుగా గల ఆవరణమంతా కోలాహలంగా వుంది. భక్తులు బారులు తీరి నిల్చుని సాయిగణేశుని రాకకై ఎదురు చూస్తున్నారు. సాయిగణేశుని దివ్యసన్నిధిలో ఏకపంచసప్తశతి (751) గణేశ చతుర్థి పూజా మహోత్సవాలను జరుపుకోవాలనే కర్ణాటకకు చెందిన శ్రీ సత్యగణపతి సంఘసభ్యుల సత్సంకల్పానికి శ్రీకారం చుట్టూ, 751 మంది గణేశులతో కొలువుదీరిన వేదిక గణేశమంటపం అక్కడ నిర్మించబడింది. కాసేపటిలో స్వామి దివ్యహస్తాలతో అది ప్రారంభించబడుతోంది. తెల్లవారుఝామున గం 4.30 నిమిషములకు స్త్రీలు గౌరీపూజ చేసిన అనంతరం గణపతి హోమము మరియు గణపతి పూజలు అక్కడ ప్రారంభమయినాయి.

ఉదయం 7 గంటలకు మందస్మితముఖారవదనంతో స్వామి కుల్వంత్ హాలులో ప్రవేశించి అశేషభక్తసందోహానికి తన దర్శనభాగ్యాన్ని కలిగించారు. శ్రీవారి ఉపన్యాస కార్యక్రమము గం॥ 7.30 నిమిషముల నుండి గం॥ 8.30 నిమిషముల వరకు కొనసాగింది. తదుపరి స్వామి శ్రీసత్యగణపతి సంఘ సభ్యుల ఆహ్వానాన్ని మన్నించి గణపతి మంటపానికి బయలుదేరారు. నాదస్వరవాద్యాలు, ఉత్తర కన్నడ ప్రాంతం వారి యక్షగానం, నృత్యములు, బెంగుళూరు బాలవికాస్ పిల్లల వేదపారాయణలు మారుమ్రోగుచుండగా స్వామి గణేశమంటపాన్ని సమీపించారు. పూర్ణకుంభం, వేదపారాయణలతో నిర్వాహకులు స్వామికి స్వాగతం పలికారు.

స్వామి జ్యోతిప్రజ్వలన చేసి సనాతనసారధి గణపతిని ఆవిష్కరించి కార్యక్రమాన్ని ప్రారంభించారు. మంటపంలో కొలువు దీరిన గణనాధులను అందరినీ తిలకించి సింహాసనాధీష్టులయ్యారు స్వామి. స్వామికి ఇరుప్రక్కల ఆదిశేషుడు కొలువైవున్నాడు. ఆదిశేషుని నీడలో షిర్డీసాయి గణపతి వున్నారు. మరొకవైపు ఇంకొకగణపతి, ఆయనతో 75 మంది గణపతులు కొలువుతీరారు. మధ్యలో అమర్చబడిన రెండు జలాశయములు చూపరులకు ఆహ్లాదాన్ని కలిగించాయి. ఆ శుభసందర్భాన్ని పురస్కరించుకొని ముద్రించబడిన ఒక సావనీర్‌ను స్వామి తమ అమృతహస్తాలతో ఆవిష్కరించారు. తదుపరి పూర్ణాహుతి, తదనంతరం హారతితో ఆనాటి ఉదయం కార్యక్రమాలు సమాప్తమయినాయి.

ఆనాటి సాయంత్రం శ్రీ ఆర్.కె. ప్రసన్నకుమార్ అండ్ పార్టీ వారిచే ఏర్పాటు చేయబడిన సంగీత కార్యక్రమము శ్రోతలను ఎంతగానో అలరించింది. స్వామి ఒక బంగారు గొలుసును సృష్టించి కళాకారుని మెడలో వేసారు. గణేశ మంటపము నందు సెప్టెంబర్ 2వ తేది నుండి 6వ తేది వరకు ప్రతి నిత్యం ఉదయం హోమములు, సాయంత్రం పూజలు జరిగినవి. 2వ తేది నవగ్రహ హోమము, పూజ, 3న గాయత్రి మరియు సాయి గాయత్రి హోమము, పూజ, 4న రుద్ర మరియు మృత్యుంజయ హోమము, పూజ, 5న షణ్ముగన్ హోమము, పూజ, 6న లక్ష్మీనారాయణ, సుదర్శన, సాయి ధన్వంతరి హోమము, పూజలు నిర్వహించబడినవి.

ఆఖరి దినమైన సెప్టెంబర్ 7వ తేదీ స్వామి ఉదయం గం॥ 7-30 నిమిషములకు గణేశ మంటపానికి విచ్చేసారు. పూర్ణాహుతి కార్యక్రమంలో స్వామి విభూతి సృష్టించారు. ముత్యాలు, నవరత్నాలతో పూర్ణాహుతి కావించారు. స్వామి ఆదేశానుసారం శ్రీ సత్యగణపతి సంఘ ట్రెజరర్ అయిన శ్రీ ఎమ్.ఎమ్. సాయి వినోద్ మాట్లాడుతూ, 1986లో ఈ సంఘం స్వామి అనుగ్రహం వలన ఏర్పడినదని తెలిపారు. స్వామి 75వ పుట్టినరోజు సందర్భంగా స్వామి దివ్యసన్నిధిలో గణేశ చతుర్థి ఉత్సవాలను జరుపుకోవాలన్న తమ కల నిజమయినందులకు సంతోషం వ్యక్తం చేసారు. 751 (ఏకపంచ సప్త శతి) మంది వినాయకులను ఏర్పాటు చేయడంలోని అంతరార్థాన్ని వివరించారు. 751 సంఖ్యలో

మొదటి రెండు సంఖ్యలయిన 75 స్వామి 75వ జన్మదినోత్సవాన్ని సూచిస్తున్నవని, చివరి సంఖ్య అయిన ఒకటి (1) సాయిగణేశునికి ప్రతీక అని, అంతే కాక 751ని కూడగా వచ్చే సంఖ్య (7 + 5 + 1 = 13, 1 + 3 = 4) నాలుగు చతుర్వేదములకు, నాలుగు దిక్కులకు ప్రతీక అని తెలిపారు. ప్రపంచం నాలుగు చెరగులా విఘ్నేశ్వరుడు ఏ విధంగా ప్రసిద్ధి నొందాడో అదే విధంగా స్వామి దివ్యత్వం జగత్ప్రసిద్ధి గాంచినదన్నారు. తదుపరి సంఘ సభ్యులకు స్వామి పాదనమస్కార భాగ్యం కల్గించారు. సాయంత్రం గం॥ 3-10 నిమిషములకు గణేశ నిమజ్జన ఊరేగింపు జరిగినది. సంఘ సభ్యులు, ఛత్రము, ఛామరము, దండము ఇత్యాదులను చేబూని, నాదస్వర వాద్యములు, భజనలు, వేదపారాయణల నడుమ పూల పల్లకీలో షిర్డీసాయి గణపతిని అధిష్టితుని చేసి సాయికుల్వంత్‌లో ప్రవేశించి స్వామి ఆశీర్వాదములను అందుకున్నారు. సాయంత్రం గం॥ 4-30 నిమిషములకు గణేశ నిమజ్జనం కార్యక్రమం పూర్తయినది.

**- భరద్వాజ్**

## శరన్నవరాత్రులు

భారతీయ ఉపాసనా పద్ధతిలో నవరాత్రులకు విశేష మహత్త్వం ఉంది. భగవతి-ఆద్యాశక్తి స్వయంగా "శరత్కాలే మహాపూజా క్రియతే యా చ వార్షికీ" అంటుంది. అంటే శరత్కాలంలో నా సంబంధమైన వార్షిక పూజ చేసేవాడు నిస్సందేహంగా నా కృపా ప్రసాదంవల్ల సమస్త ప్రకారాలైన బాధల నుండీ విముక్తుడై, ధనధాన్య పుత్ర సంపత్ సంపన్నుడవుతాడు.

శక్తి దర్శనానుసారం పరబ్రహ్మాభిన్నంగా-ఆ శక్త్యుపాసన జరగడానికి కారణం? ఆ పరమేశ్వరి సాధకునకు భుక్తి ముక్తులను రెంటినీ ప్రసాదిస్తుంది. నవరాత్రులలో శక్త్యుపాసన కొనసాగడానికి హేతువు- "నవరాత్ర" - 2 శబ్దాల కలయికవల్ల యేర్పడింది. 1. నవ + రాత్ర. 'నవ' శబ్దం సంఖ్యావాచకము రాత్రి శబ్దార్థం-రాత్రి సమూహం, కాల విశేషం అయింది. నవరాత్ర శబ్దంలో సంఖ్య, కాలాల అద్భుత సమ్మిశ్రణం జరిగింది. పాణినీయ సూత్రానుసారం - "నవానా రాత్రీణాం సమాహారః నవరాత్రమ్. రాత్రాహ నాహాః. పుంసి - సంఖ్యాపూర్వం రాత్రమ్. (క్లీబమ్ లిం సూత్రం ద్వారా) ఏర్పడింది. ఈ ప్రకారంగా ఈ శబ్దం వల్ల జగత్ సృష్టి - పాలన రూప అగ్ని - సోమాత్మక ద్వంద్వం (మిధునం) ఏర్పడి పుష్టి జరుగుతుంది. నవరాత్ర దీక్షలో అఖండ జ్యోతిని వెలిగించి ఆద్యాశక్త్యుపాసన ద్వారా మనం 'నవ' సంఖ్యపై - అజ్ఞానాంధకారరూప రాత్ర్యంధకారం వ్యాపించగా - దానిని తొలగించి 'విజయ' రూపంలో ఆత్మవిజయోత్సవాన్ని చేసుకుంటున్నాము. ఈ'నవ' సంఖ్య అఖండ అవికారీ అయిన బ్రహ్మయే. నవ సంఖ్యను ఏ సంఖ్యతో గుణించినా ఆ గుణ సంఖ్యను కలిపితే 'నవ' సంఖ్యయే అఖండ బ్రహ్మ సమంగా మెరిసిపోతుంది. అంటే సంవత్సరంలోని 360 రోజులను 9 పెట్టి భాగిస్తే 40 నవరాత్రులు వస్తాయి. 40 రోజులు ఓ మండల మవుతుంది. దేవీ భాగతంలో నిర్దిష్టంగా 2 నవరాత్రులు వస్తాయి. 40లో సున్న తీసివేస్తే మనకు ధర్మార్థ కామ మోక్షాలన్న నాలుగు పురుషార్థాలు వస్తాయి. అర్థాన్ని ధర్మంలోనూ, కామాన్ని మోక్షంలోనూ అంతర్భూతం చేస్తే శారదీయ, వాసంతిక నవరాత్రులు మనకు (అగ్ని-సోమ) యుగళం సాదరంగా లభిస్తుంది. అయినా అభేద దృష్ట్యుపాసకులు శారదీయ నవరాత్రులనే మహత్త్వ పూర్ణంగా భావిస్తారు.

రండి! వచ్చే ఈ శరన్నవరాత్రులలో శ్రీదేవీ సాహిత్య విశ్వవ్యాప్త ప్రచారానికి దీక్ష పూనుదాము.

*- పురాణపండ రాధాకృష్ణమూర్తి*

# శ్రీరాం సుకృత్ కుమార్

తిరువణ్ణామలై అనగానే రమణ మహర్షి ఆశ్రమం గుర్తుకు వస్తుంది. కాని అక్కడ అవతార పురుషుడుగా పరిగణించబడుతున్న శ్రీరాం సుకృత్ కుమార్ ఆశ్రమం ఉందనీ, దానిని కూడా దేశ విదేశాల నుండి వచ్చే భక్తులెందరో సందర్శిస్తుంటారనీ చాలా మందికి తెలియదు.

శ్రీ సుకృత్ కుమార్ తిరువణ్ణామలై వచ్చి దాదాపు 40 యేళ్లయింది. కాని ఆయనకై ఆశ్రమాన్ని నిర్మించింది ఈ మధ్యే. ఇన్నేళ్లూ ఆయనెవరో ఎవరికీ తెలియదు. ఎప్పుడూ ఆయన వెంట రెండు బస్తాలు (గోనె సంచులు) ఉండేవి. దానిలో చిత్తు కాగితాలు, గుడ్డ పేలికలూ ఉండేవి. అరుణాచలేశ్వరాలయం మెట్లవద్ద కూర్చొని భిక్షమడుక్కొనే బిచ్చగాళ్లలో ఆయన కూడా వొకరు. అందుకే ఈనాటికీ ఆయన తనను తాను 'బెగ్గర్' అనే చెప్పుకుంటారు.

యు.పి.కి చెందినవాడైన సుకృత్ కుమార్ చిన్నతనంలోనే వైరాగ్యభావంతో ఇల్లొదిలి వచ్చేసాడు. స్వామి రామతీర్థ వద్ద ఉపదేశం పొంది, తిరువణ్ణామలై చేరుకున్నాడని కొందరు చెబుతారు. అరుణాచలేశ్వర ఆలయం వద్ద వుండగా ఒకసారి ఒక చిత్రం జరిగింది. అమెరికన్ దంపతులొకరి బిడ్డకు చేతికి ఫ్రాక్చర్ కాగా ఆపరేషన్ చేసి కట్టుకట్టారు. కట్టువూడదీస్తే చేయి బాగానే అతికింది కాని పిల్ల విడుపు లేని నొప్పితో విలవిల్లాడుతుండేది. మళ్లీ ఆపరేషన్ చేసినా అదే పరిస్థితి వైద్యులకు లొంగని స్థితిలో ఎవరో ఇండియాకు వెళ్లమంటే వాళ్లు ముందుగా తిరువణ్ణామలైవచ్చారు. గుడి మెట్లపై కూర్చొని వుండగా ఆ అమ్మాయి మెట్ల కింద వున్న ఒక బిచ్చగాడి వద్దకు పోయింది. అతడా పిల్ల చేయి పట్టుకొని నిమురుతూ ఏదో చెబుతున్నాడు. తమమాటల్లో తాముండి ముందా దంపతులు ఇదేమి గమనించలేదు. ఇంతలో 'పిల్లేది'? అన్నధ్యాస రాగానే వాళ్లు కంగారుగా అటూ ఇటూ చూసి, గబగబా వెళ్లి ఆ బిచ్చగాని వద్దనుండి పిల్లను తెచ్చేసుకున్నారు. తరువాత తమ హోటల్ గదికి వెళ్లారు. మామూలుగా బాధతో నిద్రపోక తమను రాత్రల్లా వేధించే పాప ఆరోజు చక్కగా నిద్ర పోయింది. మర్నాడుదయం కూడా మామూలుగా ఆడుకొన్నది. అప్పుడు వాళ్లకు ఆ బిచ్చగాడు ఒక యోగి అనీ, తమననుగ్రహించి పిల్ల నొప్పి తీసేశాడనీ అర్థమయింది. వెళ్లి ఎంత వెదికినా అతని జాడలేదు. మూడోరోజు అతడు వూరికి దూరంగా ఒక చెట్టు నీడన వుండడం వారు గమనించారు. వెళ్లి నమస్కరించారు. అతనికి అటూ ఇటూ రెండు గోనె సంచులున్నాయి. ఎంత చెప్పినా, ఆయన తాను పిల్లకు నొప్పి తగ్గించానని వొప్పుకోలేదు. 'మైఫాదర్ హెల్ప్స్' 'నా తండ్రి సాయం చేస్తాడు' అంటూ వచ్చాడు.

**భండారు పర్వతాలరావు**

ఈ వార్త గుప్పుమనటంతో ఆయనకు భక్తమండలి ఏర్పడింది. ఆయన వద్దన్నా వినక ఆయనకొక ఆశ్రమం నిర్మించారు. ఒక విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుడుగా పదవీ విరమణ చేసినవారు ఆ ఆశ్రమ కార్యదర్శి. ఐ.ఏ.యస్. పదవిని స్వచ్ఛందంగా వదలివేసి వచ్చినవాళ్లు మరికొందరు ప్రముఖులు ప్రస్తుతం ఆ ఆశ్రమంలోనే నివాసమేర్పరచుకొని ఆయనను సేవిస్తున్నారు.

సుకృత్ కుమార్ రోజూ భక్తులకు దర్శనమిస్తారు. పటిక బెల్లపు ప్రసాదాన్ని భక్తులకు ఆశ్రమవాసి ఒకరాయన తరపున ఇస్తారు. కోట్ల రూపాయలు వ్యయంతో విశాలమైన భజన మందిరాన్నీ, అతిథులకై అన్ని వసతులతో గదులనూ నిర్మించారు. ఎక్కువగా విదేశీయులు ఇందుకు ఆర్థిక సహాయం చేస్తున్నట్లు తోచినా, స్థానికులూ, భారతీయ భక్తులు కూడా నిత్యం తమ విరాళాలను ఆశ్రమానికి భారీగానే పంపుతుంటారు. శ్రీరాం సుకృత్ కుమార్‌కు ఇదేమీ పట్టదు. 'నేను బెగ్గర్ని'నే ఆయనంటూ వుంటారు. ఆయన మహిమలను వివరిస్తూ ప్రముఖులనేకులు వ్రాసిన వ్యాసాల్తో కూడిన సావనీర్‌ను కూడా ఆ మధ్య వెలువరించారు. ఆశ్రమంలో నిత్యం భజనలు చేస్తుంటారు. ఏది జరిగినా, ఎలా జరిగినా శ్రీరాం సుకృత్ కుమార్ మాత్రం తామరాకుపై నీటి బొట్టులాగే వుంటారు గాని దేని సంగతీ పట్టించుకోరు.

# వేదపరిరక్షణ

'వేదాలలోనే అన్నీ ఉన్నాయిష!' అనే అవహేళనా ఫక్కీ నుండి, వేదాలలో ఏమున్నా, లేకున్నా ఆ వారసత్వాన్ని పరిరక్షించుకోడం అవసరం అనే గ్రహింపు వరకు మన విద్యావంతుల ధోరణిలో మార్పు వచ్చింది. కాని వేదాలను రక్షించుకోడం ఎలా?

ద్వాపరయుగాంతం వరకు 1180 వేద శాఖలుండేవనీ, వాటిని వ్యాసుడు నాలుగు ముఖ్యభాగాలుగా వర్గీకరించాడనీ, అవే నేడు నాలుగు వేదాలుగా ప్రసిద్ధినొందాయనీ కంచి పరమాచార్య శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి అభిప్రాయం. ఋగ్వేదానికి గల 21 శాఖలలో నేడు ఒక్కటే మిగిలివుంది. అది 'సాకల' శాఖ. దీనినే ఐతరేయ శాఖ అని కూడా అంటారు. ఐతరేయ ఉపనిషత్తు ఇందులోనే వుంది. శుక్లయజుర్వేదంలోని 15 శాఖలలో మహారాష్ట్రలోని 'కాణ్వ' విదర్భ, ఉత్తర భారతాలలోని 'మాధ్యందిన' శాఖలు రెండే మిగిలాయి. కృష్ణయజుర్వేదం లోని 94 శాఖలకుగాను ఒక్క తైత్తిరీయ శాఖ మాత్రమే లభిస్తోంది. ఈ వేదంలోనిదే మరోశాఖ 'మైత్రాయని' మహారాష్ట్రలో నామ మాత్రంగా వుంది. సామవేదంలోని 1000 శాఖలకుగాను మూడే మూడు మిగిలాయి. అవి : తమిళనాడులోని 'తలవకార' శాఖ, (జైమిని పరంపరలోనిది), కర్నాటకలోని 'రాణాయనీయ' శాఖ, గుజరాత్, కేరళల లోని కౌధుమశాఖ. అధర్వశాఖలన్నీ అంతరించి పోయాయను కోగా, అదృష్టవశాత్తు 'శౌనక' శాఖను బాగా అధ్యయనం చేసిన వారొకరు గుజరాత్‌లో దొరకగా అది బతికి బట్టకట్టింది.

ఈ పరిస్థితిలో వెంటనే తగిన చర్య తీసికొనకపోతే మిగిలిన శాఖలు కూడా వాడుకలో నుండి తొలగిపోతాయి. వేదం స్వర ప్రధానం కనుక వేదశాఖలను అచ్చు వేసినంత మాత్రాన ఉపయోగం లేదు. వేద పారాయణను 'టేప్' చేసే ప్రయత్నాలు కొందరు చేశారు. ఇటీవల కంప్యూటర్ బాగా ప్రచారంలోకి వచ్చింది. వేదపరిరక్షణకు కంప్యూటర్ పరిజ్ఞానెందుకుపయోగించరాదు? అని శ్రీవేదభారతి సంస్థవారు ఆలోచన చేశారు. ఈ స్వచ్ఛంద సంస్థ హైదరాబాదులోని సంజీవరెడ్డినగర్‌లో పోలీస్‌స్టేషన్ వెనుక వీధిలో వుంది. వేదాలలోని గణిత విజ్ఞానం పైన, ఛందస్సుల పైనా ఈ సంస్థ పుస్తకాలను వెలువరించింది. 'ఓం నమో శ్రీనారసింహాయ' సంకలనాన్ని ప్రచురించిందీ ఈ సంస్థే.

ఇటీవల ఈ సంస్థ వేదాలను కంప్యూటరీకరణ చేసే కార్యక్రమాన్ని చేపట్టింది. వేదాలలోని ఒక్కొక్క సూక్తాన్ని ముందు దేవనాగరి లిపిలో కంప్యూటరైజ్ చేస్తారు. ఆ సూక్తానికి ఆంగ్ల, హిందీ, ఆంధ్ర అనువాదాలను ఇస్తారు. ఆ పైన ఆ సూక్తాన్ని ఎన్ని రకాలుగా ఉచ్చరిస్తూ పారాయణ చేయవచ్చో అన్ని రకాలుగా సుస్వరంగా రికార్డు చేస్తారు. ఇవన్నీ కలిపి మల్టీమీడియా సి.డి. రూంగా రూపొందిస్తారు. ఈ సి.డి.ని ఉపయోగించి ఆ వేదసూక్తాన్ని కంప్యూటర్ తెరపై చదవొచ్చు. అర్థం తెలుసుకోవచ్చు. స్వరయుక్తంగా దానిని వినవచ్చు కూడా. ఇలా ఋగ్వేదంలోని మొదటి అధ్యాయంలోని 19 సూక్తాలకూ, రెండవ అధ్యాయంలోని 13 సూక్తాలకూ సి.డి.లు తయారయ్యాయి. ఇందులో ప్రతి సూక్తాన్ని 11 రకాలుగా భిన్న స్వరాలతో పారాయణ చేయవచ్చు. ఆ 11 రకాల స్వరాల పారాయణనూ ఈ సి.డి.లలో వినవచ్చు. అవి : సంహిత, పద, క్రమ, జట, మాల, శిఖ, రేఖ, ధ్వజ, రథ, దండ, ఘన. ఇవిగాక శ్రీరుద్రం (కృష్ణయజుర్వేదం) సి.డి.ని కూడా ఈ సంస్థ విడిగా వెలువరించింది.

ఈ సి.డి.ల మొదటి విడతను కొత్తఢిల్లీలో ప్రధాని అటల్ బిహారి వాజపేయి విడుదల చేయగా, రెండవ విడతను ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబు నాయుడు తిరుమలలో ఇటీవల విడుదల చేశారు. ఈ సి.డి.లు శ్రీ వేద భారతిలో అమ్మకానికి లభిస్తున్నాయి. వీటిని www. shopping.satyam online. com/vedio పై మార్కెట్ చేస్తున్నారు. ఈ సి.డి.ల అమ్మకాల వలన మిగిలిన సూక్తాలపై సి.డి.ల తయారీకి ఆర్థికంగా కొంత దోహదం కలుగుతుందని ఆశిస్తున్నారు.

ఆధునిక శాస్త్ర సాంకేతిక పరిజ్ఞానాన్ని వినియోగించుకుంటూ ప్రాచీన వేద సారస్వత పరిరక్షణకు ఉద్యమించిన శ్రీ వేదభారతి కృషి అభినందనీయం! ఆదరణీయం.

- భండారు సరోజినీదేవి

# స్వాతంత్ర్య సమరయోధులకు వెన్నుదన్నుగా నిలచిన హోటలు యజమాని

యుద్ధరంగంలో వీరజవాన్లు తుపాకులు చేపట్టి శత్రువులను దునుమాడుతూ ముందుకు సాగిపోతూ దేశప్రజల అభిమానాన్ని ప్రశంసలను చూరగొంటూ వుంటారు. ఇందుకు వారు అన్నివిధాలా అర్హులే. ఎట్టి సందేహంలేదు. అయితే వీరి వెనుక వెన్నుదన్నుగా వుండి వారికి భోజనాది సౌకర్యాలు కలుగజేస్తూ, వారి బట్టలు ఉతుకుతూ వారి అవసరాలు తీర్చడానికి ఎంతమంది శ్రమిస్తూ వుంటారు. వీరు అజ్ఞాతంగా వుండిపోతారు. ముందుకు సాగిపోయే వీరసైనికులకు వెన్నుదన్నుగా నిలిచే అజ్ఞాత వీరులను ఎవరూ పట్టించుకోరు.

ఈ సత్యం 1920-45 సంవత్సరాల మధ్య మహాత్మా గాంధీ నాయకత్వంలో సాగిన స్వాతంత్ర్య సమరానికి కూడా వర్తిస్తుంది. ఈ స్వాతంత్ర్య సమరంలో ఎందరో జైళ్ళకు వెళ్ళారు. లాఠీదెబ్బలు తిన్నారు. తుపాకుల గుళ్ళకు బలి అయ్యారు. ఉరికంబాలకు ఎక్కారు. ఆస్తులు పోగొట్టు కున్నారు. ఆరోగ్యాన్ని నాశనం చేసుకున్నారు. అపురూప త్యాగాలకు నిలువుటెత్తు నిదర్శనాలుగా నిలచిన వీరు ఎన్నటికీ ప్రాతఃస్మరణీయులు. కాని మరికొందరు వున్నారు. వాళ్ళు జైళ్ళకు వెళ్ళకపోవచ్చు. లాఠీదెబ్బలు తినక పోవచ్చు. కాని స్వాతంత్ర్య సమరవీరులకు వెన్నుదన్నుగా నిలచి వారిని కష్టకాలంలో ఆదుకుంటూ వుండేవారు కూడా చాలామంది వున్నారు. వారిలో రాజమండ్రికి వచ్చి హోటలు స్థాపించిన ఉడిపి బ్రాహ్మణులు వరదారావుగారు ఒకరు.

ఈ శతాబ్దం మొదట్లో మైసూరు రాష్ట్రంలోని ఉడిపి నుంచి బ్రాహ్మణులు ఆంధ్రదేశంలోని వివిధ పట్టణాలకు వచ్చి కాఫీ, భోజన హోటళ్లను స్థాపించి ప్రజాదరణ పొందేవారు. రుచికి, శుచికి ఈ హోటళ్ళు మారుపేర్లుగా వుండేవి. తెలుగు వారికి బహుశ ఇడ్లీ సాంబారు, కాఫీ సంస్కృతిని ఒంటబట్టించింది వీరే కావచ్చు. ఆ విధంగా బందరు లో పి. మంజప్ప ఒక కాఫీ హోటలును స్థాపించారు. అది చాలా ప్రఖ్యాతి గాంచింది. బందరులోని హోటళ్లన్నీ మంజప్పగారి హోటలు మూలలనుంచి ఉద్భవించినవే. బందరులో కవిత అల్లినవారూ, కథలు చెప్పినవారూ, యితరప్రాంతాలనుండి వచ్చిన కవులూ, రచయితలూ మంజప్పగారి హోటల్లో కాఫీని సేవించడం ఒకవిధిగా భావించేవారు. మంజప్పగారి హోటల్ కాఫీ సేవించి వీరందరూ సమీపంలోవున్న కృష్ణాపత్రిక కార్యాలయంలో ముట్నూరివారి ఆధ్వర్యంలో జరిగే సాహిత్య దర్బారులో పాల్గొనేవారు. మంజప్పగారి హోటలులో కవులకు ప్రత్యేకంగా ఒక కార్నర్ వుండేదిట. మంజప్పగారు కవితా ప్రియులందరి ఆదరణని అభిమానాన్ని చూరగొన్నట్లే వరదారావు దేశభక్తులందరి మన్ననలు పొందారు.

## కంచి వాసుదేవరావు

వరదరావుగారి హోటలు రాజమండ్రిలో నేటి ప్రఖ్యాత వ్యాపారకూడలి డీలక్సు సెంటర్‌లో వుండేది. రాజమండ్రిలో ఆ హోటలు అన్నివిధాలా ప్రజలను ఆకట్టుకుంది. వ్యాపారం కూడా బాగానే వుండేది. లాభాలుకూడా బాగానే వచ్చేవి. కాని వ్యాపారం చేయడం, లాభాలు ఆర్జించడమే తన జీవిత ధ్యేయంగా వరదారావుగారు భావించలేదు. తన సంపాదనలో కొంతయినా సత్కార్యాలకు ఖర్చు చేయాలని వరదారావుగారు అనుకున్నారు. వరదారావుగారు నూటికినూరుపాళ్ళు జాతీయవాది, అకళంక దేశభక్తుడు. స్వేచ్ఛాప్రియుడు. స్వాతంత్ర్య సమరకాలంలో సత్యాగ్రహలకు, పికెటింగ్‌లకు వెళ్ళే కార్యకర్తలందరకు వరదారావు గారు తన హోటల్లో ఉచితంగా ఇడ్లీలు, కాఫీలు అందచేసే వారు. దారిలో పనికివస్తాయని బుట్టలనిండా ఇడ్లీలు సర్ది పంపే వారు. ఉప్పు సత్యాగ్రహ సమయంలో రాజమండ్రి సమీప సీతానగరం నుంచి రాజమండ్రి మీదుగా సత్యాగ్రహుల బృందం బయలుదేరినప్పుడు వరదారావుగారు సత్యాగ్రహులను రాజమండ్రిలో విడిది చేయించి బుట్టలలో ఇడ్లీలు పంపారని పి.ఎన్.శర్మగారు తమ తూర్పుగోదావరి జిల్లా స్వాతంత్ర్య సమర చరిత్రలో పేర్కొన్నారు.

రాజమండ్రి స్వాతంత్ర్య సమరయోధులు జైలులో వున్నప్పుడు వరదారావుగారు ఎప్పటికప్పుడు వారి కుటుంబ సభ్యుల యోగక్షేమాలు ఆరాతీస్తూ వారికి తను చేయగలిగిన సహాయం అందజేస్తూ వారికి ధైర్యం చెపుతూవుండేవారుట.

స్వాతంత్ర్య సమరయోధులు జైలుశిక్షను పూర్తిచేసుకుని రాజమండ్రికి వచ్చినప్పుడు ఇళ్లకు వెళ్ళడానికి ముందుగా వరదారావుగారి హోటలుకు వెళ్ళి అక్కడ కాఫీఫలహారాదులను పూర్తిచేసుకుని కాసేపు సేదదీరి కుటుంబ సభ్యుల క్షేమసమాచారాలు తెలుసుకుని యిళ్ళకు వెళ్ళేవారుట. విడుదలయిన వారు పట్టణంలోవున్న కార్యకర్తలు వరదారావుగారి నివాసంలోనే, హోటల్లోనే తమ భవిష్యత్తు కార్యప్రణాళికను రూపొందించుకునేవారు. ఈ విధంగా ఆయన నగరంలోని దేశభక్తులకూ, జాతీయ వాదులకు తలలో నాలుకగా వుండేవారు.

జైళ్ళకు వెళ్ళిన కాంగ్రెస్ నాయకులన్నా, లాఠీదెబ్బలు తిన్న కాంగ్రెస్ నాయకులన్నా వరదారావుగారికి ఎంత గౌరవము, అభిమానమూ. ఇందుకు ఒక ఉదాహరణ - ప్రఖ్యాత సోషలిస్ట్ నాయకుడు ఆంధ్ర నేతాజీ బిరుదాంకితు డైన మద్దూరి అన్నపూర్ణయ్యగారు కొంతకాలం రాజమండ్రి ఇన్నీస్‌పేటలో నివసించేవారుట. అప్పటి వరదారావు గారి హోటలులో గుట్టుచప్పుడు కాకుండా భోజనం చేస్తూవుండే వారుట. ఇది వరదారావుగారికి తెలియదు. తను ఫలానా అని అన్నపూర్ణయ్యగారు ఎప్పుడూ హోటలు క్యాషియర్‌కు చెప్పలేదు. ఒకసారి అన్నపూర్ణయ్యగారు తన హోటలులో భోజనం చేస్తుండగా వరదారావుగారి కంటబడ్డారుట. వరదారావుగారు అన్నపూర్ణయ్యగారిని ఆప్యాయంగా పలుకరించారుట. వెంటనే క్యాషియర్‌ను పిలిపించి వీరు అన్నపూర్ణయ్యగారు, గొప్ప దేశభక్తులు, పదునాలుగు సంవత్సరాలు జైలులో గడిపారు. ఇటువంటి మహానుభావుడు మన హోటలులో భోజనం చేయడం మనందరికీ గర్వకారణం. ఇకనుంచి ఆయన ఎప్పుడు వచ్చినా భోజనానికిగాని, కాఫీ, ఫలహారాలకుగాని డబ్బులు తీసుకోవద్దని ఆదేశించారుట.

వరదారావుగారి మేనల్లుడు వాసుమాకి మేనమామగారి మాదిరే దేశభక్తుడు. కాంగ్రెస్ అభిమాని. ఆయనకు ఇప్పటి దేవీచౌక్ సెంటరులో ఒక హోటలు వుండేది. 1942 క్విట్ ఇండియా ఆందోళన సమయంలో వరుసగా కొన్ని రోజుల పాటు రాజమండ్రి వర్తకులు, హోటలు యజమానులు సైతం తమ వ్యాపార సంస్థలను ఐచ్ఛికంగా మూసివేసేవారు. ఇప్పటిలాగా జబర్దస్తీ బంద్‌లు వుండేవికావు. ఆ దుకాణాలను బలవంతంగా తెరిపించడానికి జబర్దస్తీ చేసేందుకు కొందరు గుండాలను పోలీసులు ఉసిగొల్పే వారు. ఐనా కొందరు వర్తకులు ధైర్యంగా నిలబడి తమ దుకాణాలు తెరవడానికి అంగీకరించేవారుకాదు. ఆ విధంగా వరదారావుగారి మేనల్లుడు తన హోటలును తెరవకుండా నిలిచారు. రౌడీలు ఆయనను చితకబాదుతూ హోటలు తెరవ వలసిందిగా అరుస్తున్నారు. ఈ విషయం ఇన్నీస్‌పేటలో వున్న వరదారావుగారికి కొందరు యువకులు సైకిళ్ళ మీద వెళ్ళి తెలియచేసారు. వరదారావుగారు వెంటనే జట్కా బండి మీద బయలుదేరారు. ఆయన వస్తున్నాడని తెలియ గానే రౌడీలు పలాయనం చిత్తగించారు. వరదారావు గారి వ్యక్తిత్వం, పలుకుబడి అటువంటివి.

వరదారావుగారికి కర్ణాటక సంగీతమంటే ఎంతో అభిమానం. ఆ రోజులలో వరదారావుగారి ఆర్థిక సహాయం ప్రోత్సాహం అందుకోని సంగీత సంస్థ వుండేదికాదుట.

రాజమండ్రిలో జరిగే ప్రతి సంగీత కార్యక్రమం వెనుక ఆయన వుండేవారు. ఎంతోమంది వర్ధమాన గాయకులను, కళాకారులను ఆయన ప్రోత్సహించారు.

వరదారావుగారు గొప్ప ఆధ్యాత్మిక చింతనాపరుడు. పాండురంగ భక్తులు. ప్రతి సంవత్సరం పాండురంగ ఉత్సవాలు నిర్వహించేవారు. తరచు పండరీనాధుని స్మరించుకుంటూ వుండేవారు. తను సంపాదించినదంతా పరుల శ్రేయస్సుకు పంచిపెట్టిన అనేకమందివల్లనే జీవితం చరమదశలో ఆయన ఆర్థికంగా ఇబ్బందులు పడేవారుట. అయినా ఆయన ఎవరినీ దేహి అని యాచించలేదు. స్వాతంత్ర్య సమరంలో కొద్దిపాటి జైలుశిక్షలు అనుభవించిన వారు, తమ ఆస్తులను క్షేమంగా కాపాడుకున్నవారు, స్వాతంత్ర్య సమరయోధులని ముద్రవేయించుకుని ప్రభుత్వం నుంచి భూములు పొందారు, పెన్షన్లు పొందారు. వారికేకాక వారి భార్యలకు సైతం వారి ఆర్థిక స్థితిగతులు ఎంతోబాగున్నా పెన్షన్ లభిస్తున్నది. ఉచిత రైలు ప్రయాణాలు ఫస్ట్‌క్లాస్ టిక్కెట్లు లభిస్తున్నాయి. ఇదంతా రెండుమూడు నెలలు జైలులో గడిపినందుకు యావజ్జీవిత కాలం లభిస్తున్న సదుపాయం.

కాని వరదారావుగారు వంటి దేశభక్తులు జైళ్ళకు వెళ్ళకపోయినా జైళ్ళకు వెళ్ళిన అనేక దేశభక్తులకన్న ఎన్నోరెట్లుగా దేశసేవను ఎట్టి ప్రతిఫలం అనుభవించకుండా అందించారు. తమ ఆస్తులను కర్పూరంలా హరింప చేసుకున్నారు. కాని వారి గురించి ఎవరూ పట్టించుకోరు. స్వాతంత్ర్య సమరయోధుల జాబితాలో వారి పేరు కన్పించదు. ఇది చాలా విచారించవలసిన విషయం.

వరదారావుగారి గురించి ఆయన సమకాలికులు చెప్పగా వినడమేతప్ప గ్రంధస్తం అయినవి తక్కువ. అందువలన వరదారావుగారి వంటివారి గురించిన జ్ఞాపకాలు శాశ్వతంగా కాలగర్భంలో కలసిపోయే ప్రమాదం వుంది. ఇప్పటి డీలక్సు సెంటరులో వరదారావుగారి హోటలు వుండేదని, అది ఆనాటి స్వాతంత్ర్య సమర సైనికులకు కేంద్ర బిందువుగా స్ఫూర్తికేంద్రంగా వుండేదని ఎంత మందికి తెలుసు? డీలక్సు సెంటర్ పేరును వరదా రావు సెంటరుగా ఎందుకు మార్చరు? ●

## పదాల పందిరి - 30

| | | | | | | |
|---|---|---|---|---|---|---|
| 1. | | * | 2 | * | 3 | 4 |
| | * | 5 | | 6 | * | |
| 7 | | | * | 8 | | |
| * | * | | * | | * | * |
| 9 | | | * | 10 | | 11 |
| | * | 12 | 13 | | * | |
| 14 | | * | | * | 15 | |

### ఆధారాలు

**అడ్డం :**
1. స్టోరీ, కథ
3. ప్రామిస్
5. నక్క ఆ ప్రక్క నుంచి వస్తే!
7. దానము కుడివైపు నుంచి
8. తొలిమంచు
9. డోంట్‌వర్రీ.. కాలం నీ నేస్తం...
10. బోను
12. చంచలమైన చంచలం
14. మాతృదేవత
15. పొరపాటుగా

**నిలువు :**
1. దెబ్బ
2. లేఖ
4. సంగరం
5. ఉగాదినాడు తెలుసుకునే సంవత్సర ఫలం
6. యానిమల్ వరల్డ్
9. తండ్రిగారి తాతగారు
11. ఎంత మధురమంటే తలక్రిందులైపోయాం
13. కాలములలో చివరిది

## పదాల పందిరి - 29 సమాధానాలు

అడ్డం : 1. కదం 3. బాకా 5. ఆనందం 7. పారాణి 9. ముగత్యా 10. రజతం 12. లుగప 14. రగ్గు 15. ఝూము

నిలువు : 1. కచిపా 2. గానం 4. కావేరి 5. ఆణిముత్యాలు 6. దంనంమారప 9. ముక్కెర 11. తంత్రము 13. గళం

# దృఢచిత్తులు

మనిషికి దైవమిచ్చిన వరము మాట. తన భావాలను, ఆలోచనలను మాటల ద్వారా వ్యక్తపరచు శక్తి మానవుడి కొక్కడికే కలదు. అందుకే మాటకున్న విలువ, శక్తి అపారము. సజ్జనుల నోట వెలువడిన మాట లెంత శక్తిమంతమైనవో, మన పురాణాలు మనకు తెలియచేస్తాయి. తపోశక్తి సంపన్నులు ఆదరంతో పలికే పలుకే వరము. ఆగ్రహంతో అభిభాషించే పలుకే శాపము. అందుకే మనిషి కూడ మాటలను తగు జాగ్రత్త గా వాడుకోవలెను. అనవసరమైన మాటలను వాడరాదు. అవసరమైన వాటిని మరువరాదు. ఒకరికి మాటయిచ్చుటకు ముందే, పూర్వాపరాల గురించి యోచన చేయవలెను. ఆవేశపడి తొందరలో మాట జార కూడదు. అనాలోచితంగా మాటనివ్వరాదు. మాటనిచ్చిన తర్వాత దానిని నిలబెట్టుకొనవలెను. అది కష్టసాధ్య మగును. ధర్మము, నీతి, న్యాయములకు కట్టుబడిఉన్న మహానుభావులే, విపరీత పరిస్థితులకు లొంగిపోయి, మాటతప్పవలసిన సంకటస్థితిలో పడిపోతారు. అలాంటి విషమ పరిస్థితులందు స్థిరముగ నిలువగల శక్తిగలవారే దృఢచిత్తులు! మేరుపర్వతము చేరువైననూ పొంగిపోని, అగ్నిపర్వతము బ్రద్దలై మీదపడిననూ కృంగిపోని వారే దృఢచిత్తులు! పరిస్థితులెంత ఒత్తిడి తెచ్చినను, ధర్మపథాన్ని విడనాడక, ధైర్యముగ నిలచేవారికి దైవకృప తప్పక లభిస్తుంది. అట్టి దృఢచిత్తులకుదాహరణలు మన పురాణములలో కోకొల్లలు.

ఆడిన మాట తప్పరాదని యిచ్చిన మాటనిలబెట్టు కోవాలని - మానవులకు తెలియచేయడానికే భగవంతుడు శ్రీరామచంద్రుని రూపంలో మానవలోకంలో అవతరించాడు. సామాన్య మానవుడై కష్టనష్టాలు, సుఖదుఃఖాలు అనుభవించాడు. ఎవరెన్ని విధాల ప్రలోభపెట్టినా, తండ్రి కిచ్చినమాటకోసం, మహర్షుల మాటనుకూడ సున్నితంగనే తిరస్కరించాడు. 'అన్నా! రామా! నేను లేని సమయము చూచి, నా తల్లి స్వార్థముతో, నా కోసం ఈ పాపకృత్యానికి ఒడికట్టింది. రాజ్యమేలవలసిన జ్యేష్ఠపుత్రునికి వనవాసమా?' అన్ని విషయములలోనూ చిన్నవాడినైన, నేను రాజ్యమేలుటా? ఇదెక్కడిన్యాయం? ఇదెక్కడి ధర్మం? చెప్పు రామా? నా తల్లి చేసిన ఈ దుష్కృత్యమును మన్నించి, అయోధ్యకు వచ్చి రాజ్యమేలుము. నేను నీ సేవలోనే తరించాలని ఉవ్విళ్ళూరుచున్నాను. నా కోరిక మన్నించు' అంటూ భరతుడు వచ్చి రాముని ఎంతగా బ్రతిమాలినా, ప్రార్థించినా శ్రీరాముని మనసు మారలేదు.

'సోదరా! భరతా! పదునాల్గు సంవత్సరములు వన వాసము చేయవలసినదిగా, మన తండ్రిగారు నన్ను ఆజ్ఞాపించినారు! నేను వారి ఆజ్ఞను శిరసావహిస్తాను. అంతే కాదు! వారి అభీష్టము ప్రకారము, నీవు పోయి అయోధ్య పట్టణానికి పట్టాభిషిక్తుడవై రాజుకావలెను'. అని హితోప దేశము చేశాడు శ్రీరామచంద్రుడు.

## సోమంచి రామం

జాబాలి అను బ్రాహ్మణోత్తముడు, రాముని మనసు మార్చవలెనను సంకల్పముతో, కొన్ని వైదికధర్మ విరుద్ధ విషయములను బోధించగా, రాముడు కృద్ధుడైనాడు!

'ఓయీ బ్రాహ్మణుడా! నీవు వైదిక వేషము ధరించిన మహానాస్తికుడవు! నీవు నాకు మేలు చేయవలెననుకొంటూ చెప్పునది అంతయూ, కార్యానుకూలముగా కనిపించే అకార్యము. హితముగా కనిపించే అహితము. నేను ఆడిన మాట తప్పను. నేనే ఆడిన మాట తప్పినచో, ఈ లోకములో నా మాట ఎవరు వింటారు? రాజు నడవడిబట్టే ప్రజల నడవడి ఏర్పడుతుంది. నేను తప్పుదారి తొక్కితే, ప్రజలు తప్పుదారి తొక్కుతారు' అంటూ మందలించాడు.

అప్పుడు వశిష్ఠమహర్షి కలుగచేసికొని, 'నాయనా! రామా! ఏ విధముగా చూసిననూ, మీ ఇక్ష్వాకు వంశములో ఎప్పుడూ జ్యేష్ఠపుత్రుడు రాజ్యము ఏలుతూ వచ్చారు. ఇది మీ వంశమర్యాద. జ్యేష్ఠుడుండగా కనిష్ఠునికి పట్టాభిషేకార్హత లేదు. కావున యిప్పుడు. నీవు వంశ మర్యాదను చెడగొట్టవద్దు' అంటూ గురువుగా ఆదేశించాడు.!

"గురువర్యా! నా తండ్రి నా జన్మకు కారకుడు! నేను ఆయన ఎదుట చేసిన శపథము అసత్యము కాకూడదు. అందువలన నేను పదునాలుగు సంవత్సరాల వనవాసము చేయవల్సిందే"నని తెగేసి చెప్పాడు! ఎవరెన్ని విధాల ప్రలోభ పెట్టినా, ఆడినమాట తప్పని ఆ రాముడు దృఢచిత్తుడు!



# భగవంతునికి అష్ట పుష్పములే అత్యంత ప్రీతికరం

ప్రేమస్వరూపులారా!

భగవంతుడు ఆశించునది షోడశోపచారములు కాదు. అష్టాదశపురాణములుకాదు. పవిత్రమైన కొన్ని పుష్పములను మాత్రమే ఆశిస్తాడు. మొట్టమొదటి పుష్పం 'అహింస'. మనోవాక్కాయములతో ఎట్టి జీవులను హింసించకుండా వుండటమే అహింస. రెండవ పుష్పం 'ఇంద్రియ నిగ్రహం'. ఇంద్రియములను అరికట్టకుండా ఎన్ని సాధనలు చేసినప్పటికినీ, అన్నీ నిరుపయోగమైపోతాయి. అయితే ఈ ఇంద్రియములను ఏ రీతిగా అరికట్టాలి? మొదటిది జిహ్వ. ఈ జిహ్వకు అనేక రుచులు అలవడిపోయినాయి. అట్టి జిహ్వను మనం అరికట్టటానికి ప్రయత్నించాలి. ఆకలి అయితే భుజించాలి. 'భిక్షాన్నం దేహరక్షార్థం' దేహరక్షణ కోసం భుజించాలి. కాని రుచుల నిమిత్తమై భుజించరాదు. ఆకలి అయితే భుజించాలి. అన్ని ఇంద్రియములకు శక్తిని ప్రసాదించాలి. 'సర్వభూత దయాపుష్పం'. ఇది మూడవది. సర్వభూతముల యందునూ దయ ఉండాలి. దేనిని మనం ద్వేషించరాదు. 'అద్వేష్టా సర్వభూతానాం' అన్నది భగవద్గీత. కేవలం ద్వేషించడం మాత్రమేకాదు. అధికంగా సంభాషణలు కూడా సలపవద్దు. అందరితోనూ ప్రేమగా నీవు జీవించు. ఇక నాల్గవది, ఇది చాలా ప్రధానమైనది. 'క్షమాపుష్పం విశేషః'! ఈ క్షమా పుష్పం చాలా విశేషమైనది. పాండవులను అనేక కష్టాలకు గురిచేశారు కౌరవులు. భార్య అయిన ద్రౌపదిని అవమానించారు. అయినప్పటికీ ధర్మజుడు 'క్షమ'ను వదలలేదు. ఆ క్షమయే పాండవులను రక్షించి, లోకమునకు పాండవుల ఆదర్శమును బోధించింది. కనుకనే క్షమాపుష్పమనేది భగవంతునికి అత్యంత ప్రీతికరమైనది. భగవంతునికి ప్రీతికరమైన పుష్పములను అర్పించినప్పుడే, భగవంతుడు సంతోషించి, మనకు వరములను అనుగ్రహిస్తాడు. భగవంతునికి ప్రీతికరమైనవి అందించకుండా, ఎన్ని రకములైన పుష్పములు అందించినా ప్రయోజనం ఏమిటి? భౌతిక పుష్పములన్నియూ వాడిపోయేటటువంటివి, రాలిపోయేటటువంటివే.

ఇక ఐదవ పుష్పం **'శాంతి పుష్పం'**. ఎన్ని బాధలు వచ్చినప్పటికినీ, ఎటువంటి ఆటంకములు ఏర్పడినప్పటికినీ, ఎట్టి అభ్యంతరములు ఎదురైనప్పటికినీ 'శాంతం' వహించాలి. ఈ శాంతం వలన దైవానుగ్రహం మనకు ప్రాప్తిస్తుంది. త్యాగరాజుకు, పోతనకు, తుకారాంకు ఎన్ని బాధలో కలిగినాయి. అన్నింటినీ అరికట్టుకొని, వారు శాంతమును వహించారు. ఈ శాంతమును వహించినటువంటివారికి భగవత్ కృప లభిస్తుంది. కనుకనే **'శాంతము లేక సౌఖ్యంలేదు'** అని త్యాగరాజు చెప్పాడు. భౌతికంగా,

## భగవాన్ సాయి దివ్యబోధ

మానసికంగా మనకు శాంతి కావాలి. ఈ శాంతిని మనం ఏ విధంగా సాధించాలి? బయట ఈ శాంతిలేదు, వస్తు వాహనాధులలో లేదు. ఈ శాంతి మన స్వరూపమే. కనుక ఈ శాంతి పుష్పము మన నుండి ఆవిర్భవించాలిగాని, బయటనుంచి వచ్చేటటువంటిది కాదు. ఈ ప్రాకృతమైన జీవితంలో ఎన్నో యిక్కట్లు సంభవిస్తుంటాయి. వీటిని లెక్కచేయకూడదు. తట్టుకొని, నెట్టుకొని ముందుకు సాగాలి. అసలు వీటిని సాధించే నిమిత్తమై మానవజన్మ వచ్చింది. మానవజన్మ కేవలం భోగభాగ్యాల నిమిత్తమై రాలేదు. ప్రాకృతమైన సుఖములను అనుభవించే నిమిత్తమై రాలేదు. వీటన్నింటినీ పశుపక్ష్యమృగాదులుకూడనూ అనుభవిస్తునే ఉన్నాయి. అదికాదు. మనం అనుభవించ వలసింది. మనం అనుభవించవలసింది నిజమైన శాంతి. అది హృదయము నుంచి ఆవిర్భవిస్తుంది. ఆ శాంతిని మనం పొందాలి.

ఇక **'తపఃపుష్పం'**. ఇది ఆరవది. 'తపస్సు' అంటే ఏమిటి? అడవులకు వెళ్ళి కందమూలాలు భుజించటమా తపస్సు? కాదు.... కాదు.... దానిని 'తమస్సే' అని చెప్పవచ్చును. 'తపస్సు' అనగా అన్నింటినీ స్వీకరించడానికి సిద్ధంగా ఉండాలి. ఇంద్రియములన్నింటినీ అరికట్టాలి.

నిరంతరమూ మన మనస్సును దైవమునందు ఉంచాలి. హృత్ + దయ = హృదయము. ఈ దయతో నిండినటువంటి మానవత్వమే నిజమైన తపస్సు. కాలము వ్యర్థం గావించడంకాదు. త్రిగుణములను ఏకత్వంగావించడమే నిజమైన 'తపస్సు'. అతనే యోగి. **'మనస్యేకం, వచస్యేకం, కర్మణ్యేకం, మహాత్మనం'** అన్నారు. మూడు గుణములనూ ఏకం చేయాలి. కోపం వచ్చినా, ఉత్సాహం వచ్చినా, సంతోషం వచ్చినా, దుఃఖం వచ్చినా వాటిని అరికట్టాలి. **"సుఖదుఃఖే సమే కృత్వా లాభాలాభౌ జయాజయౌ"** అని బోధించింది 'గీత'. సుఖదుఃఖాలను రెండింటినీ ఏకత్వంగా భావించాలి. అదియే నిజమైన 'తపస్సు'. ఏపనినైనా చేయండి. ఏ సేవలైనా చేయండి. కాని వాంఛలను మీ యందుంచుకోకండి. వాంఛారహితమైన భావమే 'తపస్సు'.

ఇక ఏడవది **'ధ్యానపుష్పం'**. ధ్యానమంటే ఏమిటి? కేవలం కళ్ళు మూసుకొని, పద్మాసనంవేసి, భగవంతుని స్మరించటం ధ్యానమని భావిస్తున్నారు. ఇది భౌతికమైన, లౌకికమైన, ప్రాకృతమైనది. ఇది కూడా అవసరమే. కాని ఎంతవరకు? పరిపూర్ణ స్థితిని పొందేంతవరకు ఇట్టి ధ్యానమును మనం ఆచరించాలి. అసలు ధ్యానమంటే ఇదికాదు. మన మనస్సు భగవంతునిలో లీనం కావాలి. పాలలో నీరు ఏకమైనట్లుగా భగవంతునితో మన మనస్సు ఏకంకావాలి. పాలలో కలిసిపోయిన నీరును వేరుచేయటం సాధ్యంకాదు. అదే విధముగనే భగవంతునితో ఏకం అయినటువంటి ప్రేమతత్త్వమును వేరుచేయటం సాధ్యం కాదు. కనుక మన ప్రేమతత్త్వం, భగవంతుని ప్రేమలో లీనం కావాలి. దీనినే 'బ్రహ్మవిత్ బ్రహ్మైవభవతి' అన్నది వేదం. మన మనస్సు భగవంతుని భావంలో ఏకమైపోవాలి. ఏదో ఉదయం, సాయంత్రం చేసింది నిజమైన ధ్యానంకాదు.

## విదురనీతి

**"యఃకశ్చిదప్యసంబద్ధో మిత్రభావేన వర్తతే**
**స ఏవ బన్ధుస్తన్మిత్రం సాగతిస్తత్ పరాయణమ్"**

ఎవడు సంబంధి కాకపోయినను మిత్రభావముతో మసలుచున్నాడో, అతడే బంధువు, అతడే మిత్రుడు, అతడే గతి, అతడే ఆశ్రయమున్ను.

**'సర్వదా సర్వకాలేషు, సర్వత్రాహరిచింతనం'**. ఏ పనిచేస్తున్నా హరిచింతనను విస్మరించకూడదు. ఏ పనిచేస్తున్నా ప్రేమను లక్ష్యమునందుంచుకోవాలి. ఇదియే నిజమైన ధ్యానం. పరిమితమైన సమయాన్ని పెట్టుకొని భగవంతుని ధ్యానించడం నిజమైన ధ్యానంకాదు. ఇది కేవలం Parttime Devotion. ఇది కాదు. Full Time Devotion కావాలి. కనుక అట్టి నిత్యమైన, సత్యమైన, శాశ్వతమైన ధ్యానమును మనం ధ్యానించాలి.

ఇంక ఎనిమిదవది 'సత్యము'. ఇది చాలా ముఖ్యమైనది. సత్యము వలననే ప్రపంచం పుట్టింది. సత్యం వలననే ప్రపంచముంది. సత్యమునందే ప్రపంచం ఐక్యమై పోతున్నది. కనుక 'సత్యం' చాలా ప్రధానమైన సాధన.

"సత్యంబునందుండి సర్వంబు సృష్టించె
సత్యంబునందణిగె సర్వసృష్టి
సత్యమహిమలేని స్థలమేది కనుగొన్న
శుద్ధ సత్యమిదియె చూడరయ్యా!"

'త్రికాల భాజ్యం సత్యం'. ఎప్పటికీ మారనటువంటిది సత్యం. సర్వమూ అంతర్థానమైనా, సత్యం మాత్రం శాశ్వతంగా ఉంటుంది. ఆ సత్యమే భగవంతుడు. కనుకనే Truth is God. Live in Truth. ఆ సత్యములోనే మనం జీవించాలి. సత్యంతోనే మనం బ్రతకాలి. సత్యమునందే మనం అంత్యమైపోవాలి. కనుక సత్యమనే పుష్పము భగవంతునికి అత్యంత ప్రీతికరమైనది. కనుక ఇలాంటి పుష్పములతో భగవంతుని మనం పూజించినప్పుడు, భగవంతుడు ప్రీతికరంగా అందుకుంటాడు. ఇంకా ఎట్టి పుష్పములనూ భగవంతుడు ఆశించడు. భగవంతునికి అష్టపుష్పములు అత్యంత ప్రీతికరమైనవి. కనుకనే

**"అహింసా ప్రథమం పుష్పం పుష్పమిన్ద్రియ నిగ్రహః**
**సర్వభూత దయాపుష్పం క్షమా పుష్పం విశేషతః**
**శాన్తి పుష్పం తపః పుష్పం ధ్యానపుష్పం తథైవచ**
**సర్వమష్టవిధం పుష్పం విష్ణోః ప్రీతికరం భవేత్ ॥**

అని చెప్పారు ఆదిశంకరులవారు.

**ప్రేమస్వరూపులారా!**

సాత్వికభావంచేత సమాజసేవలలో పాల్గొనండి. ఎంత శక్తియో అంత సేవ చేయండి. భజనలు చేస్తున్నారు. ఆ

భజనలు పాడేటటువంటివారికి తృప్తి, వినేటటువంటివారికి, విన్నంతవరకు వారికి తృప్తి, తరువాత ఆ భజనల యొక్క ఫలితమేమిటి? అది తాత్కాలికమైనటువంటిది, క్షణ భంగురమైనటువంటిది. అన్నింటికంటే కాలము చాలా ప్రధానమైనటువంటిది. ఈ కాలమును వృధా చేస్తున్నాము. ఊరువారి చింతనలతో, ప్రాకృతమైన చింతనలతో మూడు వంతుల కాలమును అపవిత్రం చేస్తున్నాం. కాలమును అపవిత్రం చేయకూడదు. కాలమును సార్ధకం చేసుకొనే నిమిత్తమై కొన్ని సేవలు చేయాలి. సమాజ సేవలలో మనం పాల్గొనాలి. సమాజ సేవలలో లీనమైన వ్యక్తికి అహంకారం నిర్మూలనమవుతుంది. ఆడంబరాలకు అవకాశమే వుండదు. మానసిక పవిత్రత అభివృద్ధి అవుతుంది. సర్వకర్మలూ మనో శుద్ధి కోసమే. **'చిత్తస్యశుద్ధయే కర్మః'** అన్నది వేదం. మనం ఏ సేవలు చేసినా చిత్తశుద్ధి కోసమే చేస్తున్నాం. చిత్తశుద్ధిలేని కర్మలు చేసి ప్రయోజనం ఏమిటి? ఎంతయో ధనమును వ్యర్ధం చేస్తున్నాము. ఎంతయో కాలమును వ్యర్ధం చేస్తున్నాము. ఎంతయో కర్మలను వ్యర్ధం చేస్తున్నాం. కాని ఒక్కదానియందైనా శాశ్వతమైన శాంతి ఉన్నదా? శాంతి లేనేలేదు. వస్తుంది. పోతుంది. కదిలిపోయే మేఘంలాగే. నిత్యమైన, సత్యమైన శాంతిని మనం కోరాలి. అదియే మన హృదయము నుండి ఆవిర్భవించేటటువంటి శాంతి. ఆ శాంతిని మనం ఆశించినప్పుడే మనకు సార్ధకత. ఎలాంటి పరిస్థితులయందైనా మనం శాంతిని వహించాలి. అదియే మనకు ఎంతో బలమును యిస్తుంది. దానివలననే దైవబలంకూడా ఏర్పడుతుంది. దివ్యశక్తి చేకూరుతుంది. లోకములో శాశ్వతమైన కీర్తిని పొందుతాం. కౌరవులు వందమంది పుట్టారు. పాండవులు ఐదుగురే. కాని ఇరువురూ పోయారు. కాని పాండవుల యొక్క కీర్తి సమాజంలో శాశ్వతంగా నిలిచిపోయింది.

**'జంతూనాం నరజన్మదుర్లభం'.** మానవత్వం పవిత్రమైనటువంటిది, భవ్యమైనటువంటిది, దివ్యమైనటు వంటిది. ఇలాంటి మానవ జీవితాన్ని మనం వ్యర్ధం గావించుకుంటున్నాం. **'లోకాస్సమస్తా సుఖినోభవంతు'.** అందరి ఆనందాన్ని నీవు ఆశించు. భగవంతుడు ఆశించేది నీవు చేసే పూజలు, అర్చనలు, దానధర్మాలు కావు. నీవు యిచ్చిన చీరెలు, నీవు పంచిన బియ్యపు మూటలుకావు. ఈ లెఖ్ఖలన్నీ Income Tax వారి కోసం వ్రాయాలిగాని, భగవంతునికి ఇవన్నీ అక్కరలేదు. నీవు ఏ భావంతో చేశావు? నీవు ఏ హృదయంతో చేశావు? ఏ ప్రేమతో చేశావు? అదే భగవంతుని దృష్టిలోనికి వస్తుంది. కనుక మనం ప్రేమతో చేయాలి, త్యాగంతో చేయాలి.

మనం చేయవలసిన పూజలు అహింసా పుష్పంతో ప్రారంభమై, సత్యపుష్పంతో అంత్యం కావాలి. ఈ ప్రారంభం, అంత్యం రెండూ చేరినప్పుడే మానవజీవితం ధన్యమవుతుంది. భగవద్గీత ఏమి చెప్పింది? అని ప్రశ్నిస్తే జ్ఞానమును, భక్తిని, కర్మను బోధించిందంటారు. కాదు... కాదు... భగవద్గీతలో మొదటి శ్లోకం 'ధర్మక్షేత్రే' అనే పదంతో ప్రారంభమై అంత్య శ్లోకంలో అంత్యపదం 'మమ'తో

తరువాయి 32వ పేజీలో.........

**- 7**

**శరీరంలో రక్తం ప్రవహిస్తుంది. గడ్డకట్టదు. కానీ గాయం ద్వారా రక్తం వస్తే గడ్డకట్టేస్తుంది. ఎందుకు?**

శరీరంలో ప్రవహించే రక్తం గడ్డకట్టదు అనే విషయం నిజంకాదు. రక్తనాళాల్లో రక్తం గడ్డకట్టిన సందర్భాలు ఎన్నో ఉన్నాయి. గాయం ఏర్పడినప్పుడు రక్తం గడ్డకట్టాలి. లేకపోతే శరీరం రక్తాన్ని నష్టపోతుంది. ఈ గాయం శరీరం లోపలయినా, బయట అయినా రక్తం గడ్డకడుతుంది.

శరీరానికి గాయం అయినప్పుడు రక్తనాళం తెగడం, నలగడం వల్ల రక్తం వెలుపలకు వస్తూ దెబ్బతిన్న కణాన్ని తాకుతుంది. ఈ దెబ్బతిన్న కణం రక్తంలోకి రెండు పదార్ధాలను విడుదల చేస్తుంది. ఈ రెండు పదార్ధాలు 'త్రాంబిన్' అనే ప్రోటీన్ ఎంజైమ్‌ను తయారు చేస్తాయి.

ఈ 'త్రాంబిన్' రక్తంలోని 'ఫిబ్రినోజిన్'తో చర్యకు దిగి 'ఫిబ్రిన్' ఏర్పరుస్తుంది. ఈ ఫిబ్రిన్ అణువులు దారాల్లా తయారయి దెబ్బతిన్న రక్తనాళానికి 'మెష్' మాదిరి వలగా శరీరం మీద గాయం ఏర్పడ్డచోట అతుక్కుపోతుంది. రక్తంలోని రక్తకణాలు, ప్లేట్‌లెట్స్, ప్లాస్మాలు ఈ మెష్‌లో ఇరుక్కుపోయి గడ్డకడతాయి. అంటే గాయానికి బిరడాగా తయారయిపోతాయి.

**- సి.వి. సర్వేశ్వరశర్మ**

# సంతృప్తి - సంతుష్టి

"అకించనస్య దాంతస్య
శాంతస్య సమచేతనః
సదా సంతుష్ట మనసః
సర్వా సుఖమయా దశః"

ఎప్పుడూ సంతుష్టి, సంతోషకరమైన మనస్సు కలవారికి మరేమి అక్కరలేదు. తనదంటూ ఏమీ లేనివాడు, దాంతుడు, శాంతుడు, సమమైన మనస్సు కలవాడు, ఎల్లప్పుడూ సంతృప్తితో సంతోషంగా ఉండేవాడు - ఇలాంటి వానికి ఏది చూచినా, అంతా సుఖంగానే కనపడుతుంది.

'సంతుష్టి' అనేది మానవులలో వుండవలసిన ప్రధానమైన గుణం. సంతృప్తి గలవానికి కోరికలు వుండవు. కోరికలే దుఃఖానికి మూలకారణం గదా! కోరికలే గనుక లేకపోతే విచారానికే ఆస్కారం ఉండదు. కనుక సంతృప్తి గలవాడు ఎల్లప్పుడూ సంతోషంగా ఉండగలుగుతాడు.

దయాదాక్షిణ్యములు కలవానికి, తనదంటూ ఏమీ దాచుకోనివానికి, ఎల్లప్పుడూ సంతృప్తితో సంతోషంగా వుండేవానికి, సమభావంగలవానికి లోకమంతా మంచిగానే కనిపిస్తుంది, సుఖంగానే కనపడుతుంది. విచార దుఃఖములు అతని దృష్టికి రానేరావు. 'శాంతము' అనేది చాలా గొప్ప గుణం. దీనిని అలవరచుకోవటం మాత్రం చాలా కష్టము. శాంతముగా ఉండు! ఏమీ మాట్లాడకు! అన్నీ విని వూరుకోమని చెప్పటం చాలా తేలిక. ఆచరించటమే కష్టము. శాంతమే లేకపోతే సౌఖ్యము లేదు. అదే విషయమును త్యాగరాజు చక్కగా చెప్పాడు.

"శాంతములేక సౌఖ్యములేదు
సారసదళనయనా!
దాంతునికైన వేదాంతునికైన ... ॥శాం॥
దారాసుతులు ధనధాన్యము కలిగిన
సారెకు జపతప సంపద కలిగిన ...." ॥శాం॥

రాజాధిరాజుకైనా, పాండిత్యంగల మహాపండితునికైనా, ఎంత గొప్పవానికైనా సరే శాంతము లేకపోతే సౌఖ్యమే లేదు. కనుక శాంతమును ప్రతి ఒక్కరూ అలవరచుకున్నప్పుడే సౌఖ్యమును పొందగలుగుతారు. 'శాంతిలేని జీవి శశిలేని నిశి" అన్నారు భగవాన్ బాబా. మానవునికి సంపదతో శాంతి చేకూరదు. మనస్సుకు శాంతిలేకపోతే దుఃఖాలు మనల్ని వెంటాడుతునే ఉంటాయి. ఒక్క చిత్తశుద్ధి వలననే శాంతి ఉదయిస్తుంది. త్యాగము వలననే చిత్తశుద్ధి కలుగుతుంది. కర్మఫలమును నిష్కామ బుద్ధితో త్యజించుటయే 'త్యాగం' అందువలన 'త్యాగాత్ శాంతిః' అన్నారు. త్యాగము వలననే శాంతి చేకూరగలదు. ఈ సద్గుణములన్నింటికి మూలం 'సంతుష్టి'. అయితే....

"అసంతుష్టోద్విజోనష్టః, సంతుష్ట ఇవపార్థివః" అన్నారు మన మహర్షులు. సంతుష్టి అనేది అందరికీ వుండాలి గాని, రాజులకు (పరిపాలకులకు) మాత్రం ఉండకూడదు. రాజులకు గనుక సంతృప్తి వుంటే, వారు సామ్రాజ్యమును విస్తరింపజేయలేరు. దేశ సంపదను పెంచలేరు. కనుక రాజులకు (పరిపాలకులకు) సంతృప్తి పనికిరాదు.

- సాయిప్రియ

## భగవాన్ సాయి జన్మదిన ప్రత్యేక సంచిక

**భగవాన్ సాయి 75వ జన్మదిన ప్రత్యేక సంచిక ఎక్కువ పేజీలతో, మల్టీకలర్ కలరుపేజీతో భగవాన్ సాయి దివ్యోపదేశములతో, ప్రముఖుల వ్యాసములతో, భక్తుల అనుభూతులతో, భగవాన్ సాయి దివ్యలీలలతో సర్వాంగ సుందరంగా పాఠకులకు నవంబర్ మొదటి వారంలో అందించబడుతుంది.**

**త్వరపడండి! ప్రత్యేక సంచికను స్వంతం చేసు కోండి. వెల రు. 15/-లు మాత్రమే. చందా కట్టినవారికి రు. 5/-లకే పంపబడుతుంది. అదనంగా చెల్లించనవసరంలేదు. పాత చందాదారులకు కూడా ఈ ప్రత్యేక సంచిక పంపబడుతుంది. వారు కూడా అదనంగా డబ్బు పంపనవసరంలేదు.**

**చందా రెన్యూవల్ చేయనివారికి ఈ ప్రత్యేక సంచిక పంపబడదు. కనుక వెంటనే 'రెన్యూవల్' చేయండి. క్రొత్త చందాలను చేర్పించి, పంపి ఈ సదవకాశమును వినియోగించుకో ప్రార్థన.**

- సం

ఓణం సందేశం



# పరుల గౌరవించువాడు పుణ్యుడు

పరుల నిందించువాడు 'పాపి'
పరుల గౌరవించువాడు 'పుణ్యుడు'
"విష్ణుదర్శన మార్గంబు పొందగోరి
వెడలబోయేది ఎచటికె వెర్రి మనసా!
అతడు నీలోన నుండగ భక్తి శ్రద్ధతో
భజియింపు బలి చక్రవర్తివలెను"

*ప్రేమస్వరూపులారా!*

బలిచక్రవర్తి విష్ణుప్రియుడు. దానహస్తుడు, ధర్మశీలుడు. కాని, అతను దానవ వంశంలో జన్మించుటం చేత, అతని పేరుకు కొంత కళంకం ఏర్పడినది. బలి చక్రవర్తి విశ్వజిత్ యజ్ఞమును ఆచరించుచుండగా, వామనుడు ప్రవేశిస్తాడు. అతనిని తరింపజేయగోరి మూడడుగుల భూమిని దానం చేయమని కోరుతాడు వామనుడు. అప్పుడు 'బలి' తనను తాను అర్పితం గావించుకొనే నిమిత్తమై అంగీకరిస్తాడు. లోకంలో ధనకనక వస్తువాహనాదులను దానం చేసేవారు ఎందరో ఉన్నారు. కాని ఇవన్నీ దానములుకావు. తనను తాను అర్పించుకోవటమే నిజమైన దానము.

డేగకు ఇచ్చిన వాగ్దానమును నెరవేర్చుకోవటానికోసం, అభయమిచ్చిన పావురాన్ని రక్షించడానికోసం ఏమాత్రం వెనుకాడకుండా, తన శరీరాన్నే కోసి డేగకు సమర్పించుకుంటాడు 'శిబిచక్రవర్తి'. ఇదే విధముగా శ్రీరాముడు పితృవాక్య పరిపాలన నిమిత్తమై, తనరాజ్యమును కూడా త్యజించి, పదునాలుగు సంవత్సరాలు అరణ్యవాసం చేసి, తన తండ్రి పేరును సార్థకంగావించాడు. ఇదే విధముగా గాంగేయుడు (భీష్ముడు) తన తండ్రిని సంతోషపెట్టటానికోసం త్యాగం చేసి, యావత్ జీవితం బ్రహ్మచారిగానే గడిపాడు. కనుకనే వీరి పేర్లు జగత్తులో వ్యాప్తి అయినాయి. ఇదే విధముగ భారతదేశ చరిత్రను పరికిస్తే అనేకమంది త్యాగ పురుషులు కనిపిస్తారు. ఇలాంటి త్యాగభూమి, యోగభూమి, కర్మభూమి అయిన భారతదేశమునందు, కేరళ రాష్ట్రంలో బలి చక్రవర్తి లాంటి త్యాగి జన్మించాడు. 'బలి' అనగా త్యాగము అని, అర్పితము అని అర్థము.

ఈ బలి చక్రవర్తి త్యాగమును స్మరించుకుంటూ, ఆనందిస్తూ, అనుభవిస్తూ, అందిస్తూ కేరళ ప్రజలు ఉత్సవాలను ప్రతిసంవత్సరం జరుపుకుంటూ వస్తున్నారు. ఇది త్యాగమునకు పెట్టిన భూమి, పుట్టిన ఇల్లు. ఈనాటికీ అనేకమంది త్యాగులు కనిపిస్తారు. 'త్యాగరాజు' కూడనూ ఆ కేరళ రాజ్యంలోనే పుట్టి, పెరిగి తన త్యాగమును ప్రపంచమునకు ప్రబోధించాడు. ఇలాంటి త్యాగభూమిని నేడు భోగభూమిగా మార్చుకుంటూ, త్యాగమును విస్మరిస్తున్నాము.

## భగవాన్ సాయి దివ్యబోధ

"పరమపావనమైన భారతావనియందు
సహనమన్నదె మనకు చక్కదనము
మధుర భావంబేది మనదేశమందన్న
మాతృభావము కన్న మాన్యమెద్ది
ప్రాణంబు కంటెను మానంబె ఘనమను
మన దేశనీతిని మంటగలిపి
నేటికిచ్చిరి పరదేశ నీతులరసి
వెస విచిత్ర స్వేచ్ఛయను విచ్చుకత్తె
ఔర! ఏమందు ఈ భారత పాలనంబు
ఏనుగెట్టుల తన బలమెఱుగ లేదొ
అట్టులైనారు ఈ భారతీయులు నేడు."

అయితే ఈనాడు యావత్ ప్రపంచమునకే విఖ్యాతి గాంచినట్టి త్యాగశీలురైనటువంటి వారి స్థితి, ఈనాడు దినదినానికి దిగజారిపోతున్నది. ఐకమత్యమే దూరమైపోతున్నది. మనిషికి మనిషికి మధ్యలో మంటలు చెలరేగుతున్నాయి. నిజంగా మానవునియందు పుట్టవలసిన గుణములా ఇవి? దయ, ప్రేమ, కరుణ, సహనం, సానుభూతి, సత్యము ఇత్యాది పవిత్రములైన మానవతా గుణములు మానవుని యందు ఆవిర్భవించాలి. అయితే ఇట్టి మానవతా విలువలను మంటగలుపుతున్నారు ఈనాటి మానవులు. మానవతా విలువలను కోల్పోయిన తరువాత మానవుడు

వుండి ప్రయోజనం ఏమిటి? మానవుడు దయామయుడుగా మారాలి. పార్టీలు వేరైనా ప్రేమ ఒక్కటిగా వుండాలి. కాని ఈనాడు మానవుడు పార్టీలు పేరుతో ప్రేమను నాశనం చేస్తున్నాడు. ఏమిటి ఈ పార్టీ? పార్...టీ.... అంతే. ఈ అల్పమైన వాటి కోసం, మానవుడు తన విలువైన ప్రేమను త్యాగం చేస్తున్నాడు. ప్రేమ మానవుని యొక్క జన్మహక్కు. ప్రేమతో ప్రజలను ప్రేమించాలి. ప్రజల ప్రేమను తాము ఆరగించాలి. మానవుడు ప్రేమ పాత్రుడు కావాలి. ద్వేషములను ప్రక్కకు నెట్టి ప్రేమతో జీవించాలి.

అయితే ఈనాడు మానవుని యందు మానవతా విలువలే శూన్యమైపోయినాయి. ద్వేషము, అసూయ, ఆడంబరం, డంబం - ఇత్యాది దుర్గుణములు పెరిగి పోతున్నాయి. ఈనాడు మానవుడు తన బిడ్డలను కూడా ప్రేమించలేని స్థితికి దిగజారిపోతున్నాడు. నిరంతరమూ టెన్షన్, టెంబర్‌లతో జీవిస్తున్నాడు. ఇలాంటి మానవుడు దేశమును ఏరీతిగా ఉద్ధరించగలడు? మేము దేశనాయకులమని చెప్పుకుంటున్నారు. వీరు దేశనాయకులు మాత్రమే. దేశమును ఉద్ధరించేవాడే నిజమైన దేశనాయకుడు.

ఈనాడు ప్రపంచంలో ఎక్కడ చూచినా ద్వేషము... ద్వేషము... దేహమంతా ద్వేషముతోనే మండిపోతున్నది. దేహాన్ని కట్టెలు కాల్చనవసరం లేదు. ద్వేషమే దేహమును కాల్చివేస్తుంది. దేహమును ద్వేషంతో భస్మం గావించు కుంటున్నాడు.

## సనత్సుజాత ఉవాచ

"సంభోగ సంవిద్విషమోఽతిమానీ
దత్త్వా వికత్థీ కృపణో దుర్బలశ్చ
బహుప్రశంసీ వనితా ద్విట్సదైవ
సప్తైవోక్తాః పాపశీలా నృశంసాః"

సంభోగాసక్తుడు, విషమబుద్ధిగలవాడు, అతిగర్వితుడు, దానం చేసి చెప్పుకొనేవాడు, కృపణుడు, అజ్ఞానియైన ఆత్మస్తుతి పరాయణుడు, నిరంతరం తన భార్యను ద్వేషించేవాడు - అనే ఈ ఏడుగురు పాపకర్ములని చెప్పబడుతున్నారు.

- తెనుగుసేత 'శాంతిశ్రీ'

ప్రేమస్వరూపులారా! మానవతా విలువలను పోషించు కుంటూ మానవులుగా జీవించాలి. మానవుడు ఒక పెద్ద 'మాగ్నెట్'. ప్రపంచంలో ఉన్న శక్తులన్నియూ మానవుని యందే ఉంటున్నాయి. ప్రపంచంలోనే ప్రఖ్యాతిగాంచినటు వంటి భారతదేశంలో ఏనాటి నుంచో ఈ సద్గుణములను ప్రకటిస్తూ వచ్చింది.

"ఖండ ఖండాంతర ఖ్యాతి నార్జించిన
మహనీయులను గన్న మాతృభూమి
పాశ్చాత్యవీరుల పారద్రోలించియు
స్వాతంత్ర్యమును గన్న సమరభూమి
పాండిత్యమున చాల ప్రఖ్యాతి గాంచియు
ప్రతిభ చూపించిన భారతభూమి
సంగీత సాహిత్య శాస్త్రీయ విద్యల
ధీశక్తి చూపిన దివ్యభూమి
చిత్రకళలతోడ చిత్రమైయున్నట్టి
భరతభూమి యందు జననమంది
భరతమాత సత్యభాగ్యంబు కాపాడ
బాధ్యతంతయు మీదె భక్తులారా!"

ప్రాచీన కాలమునుండి భారతదేశము సద్గుణములను పోషిస్తూ, ప్రచార ప్రబోధలు చేస్తూ ప్రజల కందించినది, అలాంటి పవిత్రమైన భారతభూమి, ఈనాడు క్షీణించి పోతున్నది. ఇది మారాలి. దేశము యొక్క పేరు ప్రఖ్యాతులను నిలబెట్టాలి. మన సంస్కృతీ గౌరవ మర్యాదలను కాపాడాలి.

"ఇది నాదు మాతృదేశము
ఇది నాప్రియ మాతృభాష
ఎదగొట్టి నుడువనేరని
బదికిన జీవి యొకండు వసుధన గలడా."

దేశాభిమానం పోయింది, భాషాభిమానం పోయింది. సంస్కృతీ అభిమానం పోయింది, సర్వమునూ కోల్పోయి కట్టకడపటికి శవంగా నిలిచిపోయాడు ఈనాటి మానవుడు. పరమశివునిగా ప్రత్యక్షం కావలసిన మానవుడు, పరమశవంగా మారిపోతున్నాడు. ఏ మానవునియందు అసూయద్వేషములు ఉంటాయో, అతను మరణించినవాడితో సమానము. అలాంటివారిని దరికి చేరనీయరాదు. వీరు భారతదేశము నకు అపకీర్తిని తెచ్చిపెట్టేటటువంటి చీడపురుగులు. ఈనాడు దేశంలో ఎక్కడ చూచినా అల్లర్లు, అల్లకల్లోలములే.

"పరుల నిందించువాడు 'పాపి' యగును. పరుల గౌరవించువాడు పుణ్యుడగును" ఈ యదార్థమును

తెలుసుకొనక పరులను నిందించటమే పరమావధిగా పెట్టుకుంటున్నారు కొందరు. ఎవర్ని విమర్శించినా, నిన్ను నీవు విమర్శించుకున్నట్లే, నీదేవుని నీవు విమర్శించినట్లే. ఎవర్ని నీవు గౌరవించినా, నీ దేవుణ్ణి నీవు గౌరవించినట్లు, నీ దేశాన్ని నీవు గౌరవించినట్లు. దేహాభిమానము, దేశాభిమానము ఎంత ప్రధానమో, లోకాభిమానము, ధర్మాభిమానము కూడా అంత అవసరం. అయితే ఈనాటి మానవుడు స్వార్థ స్వప్రయోజనాలతో తన జీవితాన్ని నాశనం చేసుకుంటున్నాడు.

ప్రతి మానవుడూ ప్రేమస్వరూపుడే. ఏదేశముననున్న, ఏకాలమునందైనా వున్నటువంటి మానవులందరూ దైవస్వరూపులే. కనుక మనం ప్రతిమానవుడిని గౌరవించాలి, ప్రేమించాలి. వారివారి దుర్గుణములు వారినే బాధించ గలవు, కాని మనం మాత్రం వారి దుర్గుణములను గురించి యోచించకూడదు. భగవంతుడు ఎంతో పవిత్రుడు. అట్టి పవిత్రమైన దైవత్వం నీయందు కూడా ఉన్నది. నీవే భగవంతుడవు నిజంగా ఆ భావంతో చూడు. తప్పక సాక్షాత్కరిస్తాడు. నేను మానవుడను.... నేను మానవుడను... అనుకుంటుంటే మానవతా భావములే ఆవిర్భవిస్తుంటాయి. కనుక దేహభావములను విసర్జించు, దైవభావములను విశ్వసించు. అప్పుడు నీవు ధన్యుడవై పోతావు. ఇటువంటి సత్యబోధలు బోధించే నిమిత్తమై వామనుడు బలి చక్రవర్తి వద్దకు వచ్చి "బలీ! నీవు సామాన్యుడవు కాదు. ఎక్కడికి పోయినప్పటికినీ, నా భావములు నీయందే ఉంటున్నాయి. నీ దేహమును కేవలం మానవదేహంగా విశ్వసిస్తున్నావు. కేవలం ఈ దేహం మల మూత్ర దుర్గంధ మాంసరక్తమేగాని పునుగు జవ్వాజీలు పుట్టబోవు" అలాంటి దేహము నీవవుతావా? కాదు...కాదు... ఇది కేవలం తోలుబొమ్మ! ఇందులో నివసిస్తూన్నది శాశ్వతమైన బొమ్మ. జీవుడుండు దేహమందే, జీవుడందు దేవుడుండు. రెండు కూడి ఆటలాడి ఒకరి నొకరు వీడుచుండ్రు. బొమ్మలాటలాడించే సూత్రధారి ఒకడుండు. ఇరువు చేరి ఒకడుండు, ఒకరిలోనే ఇరువురుండు. కాబట్టి నీవు ఒకడివికాదు. You are not alone, You are with God, In God, For God, To God. ఇలాంటి పవిత్ర భావాలను నీవు సంపాదించు కోవాలి. ఈ రకమైన పవిత్రమైన భావములు వుంటుంటే, మన కర్మలన్నీ పవిత్రమైన కర్మలుగా రూపొందుతాయి" అని బోధించాడు వామనుడు.

విద్యార్థులందరూ పవిత్రమైన గుణములు కలవారే. కాని చుట్టూ వుండే వాతవరణమే వారిని పాడుచేస్తున్నది. విద్యార్థులారా! మీరు ఏ సేవలయినా చేయండి, అభ్యంతరం లేదు. కాని, రాజకీయాలలో మాత్రం చేరకండి. ఇవే ఈనాడు మీ హృదయాలను చెడగొడుతున్నాయి. చెడ్డభావములన్నీ రాజకీయాల వలననే లభిస్తున్నాయి. చెడిపోవాలనుకుంటే రాజకీయాలలో చేరండి. ప్రాచీన కాలంలో భారతదేశంలో పవిత్రులైన రాజకీయనాయకులు

## దివ్యసుగుణబాల

నరుడు నరుని రోసి నరకమ్ము సృష్టింప
జాతికెట్లు మేలు జరుగునయ్య!
మనిషి మనసునందు మానవత్వము పెంచు
దివ్యసుగుణబాల! ధీ విశాల!!

అంతరంగమందు ఆశలు పెనవేసి
రామ రామ యనగ రాదుముక్తి
దేహశుద్ధి చేసి దేవుని స్మరియించు
దివ్యసుగుణబాల! ధీ విశాల!!

క్రొవ్వు వొత్తి చూడ కొంచమై వుండినా
దట్టమైన నిశిని తరిమివేయు
అల్పమైననేమి అనఘుల ప్రాణము
దివ్యసుగుణబాల! ధీ విశాల!!

చదువు ఎంత కలిగి సంస్కార లేమిచే
యశము పొందలేడు యెవ్వడైన
చదువుకన్న మిన్న సంస్కారమరయంగ
దివ్య సుగుణబాల! ధీ విశాల!!

పరులు మేలుకొరకు ప్రాణాలు అర్పించు
మానవుండు మహిని మానధనుడు
ఒరుల సొమ్ముకెపుడు ఉరకలు వేయకు
దివ్య సుగుణ బాల! ధీ విశాల!!

- సి. కామేశ్వరరావు, కాసిబుగ్గ.

ఎందరో వుండేటటువంటివారు. వారు ఆచరించి ఆదర్శములను అందించేటటువంటివారు. అందువలననే ఆనాటి యువకులు, వారి స్ఫూర్తిని పొంది రాజకీయాలలో చేరేవారు. ఆనాడు జయప్రకాశ్ నారాయణ వస్తున్నాడు, నేతాజీ వస్తున్నాడు అంటే గుంపులు గుంపులుగా వెళ్ళేవారు. నివాసగృహాలలో వీరి పవిత్రమైన ఫొటోలను పెట్టుకునేవారు. కాని ఈనాడు ఎవరి గదిలో చూచినా సినిమావారి బొమ్మలే కనిపిస్తున్నాయి. ఆదర్శమైన వారి చిత్రాలకు స్థానం లేకుండా పోయింది. ఈనాడు ఆదర్శమైన వాక్కులు కూడా వినిపించటం లేదు. ఆనాటివారు పవిత్రులు, పరిశుద్ధులు కావటం వలననే వారిని ఆదరించారు, ఆశ్రయించారు.

*ప్రేమస్వరూపులారా!* మీరు కూడా పవిత్రహృదయులు కాండి! అందరినీ ఆకర్షించండి. మానవుని యందు గొప్ప 'మాగ్నెట్' ఉన్నది. అదే ప్రేమ....ప్రేమ.... Love is God, Live in Love. ఆ 'ప్రేమ' అనే 'మాగ్నెట్'ను పవిత్రం గావించుకోండి. అందరూ మిమ్మల్ని ఆశ్రయిస్తారు. ఒక్క విషయం చెబుతాను. ఈనాడు మీ అందరినీ ఆహ్వానించానా? రమ్మనమని చెప్పానా? నా ప్రేమ అనే మాగ్నెట్టే మిమ్ములందరినీ ఇక్కడకు చేర్చింది. నా పెద్ద ఆస్తి.. ప్రేమే.. ప్రేమే... నాకు ఏ ఆస్తి అవసరం లేదు. ఈ ప్రేమే నా పెద్ద ఆస్తి. దీనికి మించిన ఆస్తి మరి ఎవరి వద్దాలేదు. కనుక మీరు కూడా ఈ ప్రేమ అనే ఆస్తిని పెంచుకోండి. ఎవరిని చూచినా ప్రేమతో పలుకరించండి. మృదువుగా, మధురంగా మాట్లాడండి. అప్పుడే మీకందరూ మిత్రులవుతారు. మిత్రులను సంపాదించుకోవటంలో మీ సర్వమునూ త్యాగం చేయండి. ప్రేమను సాధించండి!

(ది. 10-9-2000న ప్రశాంతి నిలయంలో 'ఓణం' సందర్భమున భగవాన్ సాయి చేసిన దివ్య ప్రసంగము నుండి.)

**రసవద్ఘట్టాలు - 50**

## నిజాయితీకి నిలువద్దాలు

అమెరికా అధ్యక్షుడైన అబ్రహాంలింకన్ ప్రజాభిమానాన్ని చూరగొన్న నాయకుడు. ఆయనవంటి గుణనిధిని కన్న ఏ తల్లి అయినా గర్విస్తుంది. లింకన్ పుస్తక ప్రియుడు, నిరాడంబరుడు.

1860లో అమెరికాలోని ఇలినాయ్ రాష్ట్రంలో జరిగే ఎన్నికలు ప్రత్యేకత సంతరించుకొన్నాయి. ఎన్నికలలో పోటీ చేయు అభ్యర్థులు పాలకపక్షం-విపక్షం అను తేడా లేకుండా జంటగా ప్రచారం చేయాలన్న నియమం వుండేది.

అబ్రహం లింకన్‌తో తలపడే అభ్యర్థి ఏర్పాటు చేసుకొన్న వాహనంలోనే లింకన్ కూడా ప్రచారానికి వెళ్ళారు.

ఒక సాయంకాలం పెద్ద సభ ఏర్పాటు చేశారు. ఎక్కువగా రైతులు పాల్గొంటున్న సభ లింకన్ సభలో మాట్లాడుతూ "అయ్యా స్వంత వాహనం కొనే తాహతు లేనివాణ్ణి, నేను బీదవాణ్ణి, నా మిత్రుని ఆహ్వానంపై అతని వాహనంలోనే ప్రయాణం చేస్తున్నాను. మీకు ఇష్టమున్న నాకు ఓటు ఇవ్వండి, లేకున్న నా ప్రత్యర్థికి ఓటు వెయ్యండి ఆయన చాలా మంచివాడు" అన్నాడు. లింకన్ నిజాయితీని అందరూ మెచ్చుకొన్నారు. భారీ మెజారిటీతో లింకన్ ఎన్నుకోబడినారు.

జాతి విచక్షణను, బానిసత్వాన్ని నిర్మూలించి ఉత్తర దక్షిణ అమెరికాలను సమైక్యపరచిన అబ్రహం లింకన్ 1865 ఏప్రిల్ 14 రాత్రి పది గంటల వేళ నాటకం చూస్తుండగా, గుర్తు తెలియని వ్యక్తి తుపాకి గుళ్ళకు బలికావడం విధి వైచిత్రం.

తొలి తెలుగు రాజకీయ ఖైది, ఆంధ్రతిలక్‌గా విఖ్యాతులైన గాడిచర్ల హరి సర్వోత్తమరావు గారు, నంద్యాల నియోజకవర్గం నుండి కాంగ్రెస్ అభ్యర్థిగ 1927లో మద్రాస్ లెజిస్లేటివ్ కౌన్సిల్‌కు పోటీ చేశారు. ప్రత్యర్థి శరభారెడ్డిగారు జస్టిస్ పార్టి అభ్యర్థి. ఒక సభలో ఇద్దరూ కలిసి తమ ప్రచారాన్ని చేశారు. శరభారెడ్డి గారు, మాట్లాడుతూ, "గాడిచర్ల హరిసర్వోత్తమరావు గారు, ఎం.ఏ. పట్టభద్రులు దేశస్వాతంత్ర్యం కోసం పోరాడుతూ, మూడేళ్ళ జైలు శిక్ష అనుభవించారు. సేవా పరాయణుడు. కాని ఆయన కాంగ్రెస్ పార్టీకి చెందినవారుకాన, వారికి ఓటు ఇవ్వకండి జస్టిస్ పార్టి అభ్యర్థినే గెలిపించండి" అన్నారు.

గాడిచర్ల వారి మొట్ట మొదటి రచన 'అబ్రహం లింకన్ జీవిత చరిత్ర' అన్న వాస్తవం గమనింపదగినది.

**- జానమద్ది హనుమచ్ఛాస్త్రి**

అమెరికా పర్యటన....... 2వ కవర్ తరువాయి........

**రంగాలలో ఉభయదేశాలకు పరస్పర ప్రయోజనకరమైన అంశాలలో సహకారం మరింతగా పెంపొందుతుంది. ప్రపంచంలోనే అతిపెద్ద ప్రజాస్వామ్య దేశమైన భారత్‌తో, అమెరికా మరింత సన్నిహిత సంబంధాలను కోరు కుంటున్నది"** అని ప్రముఖ పత్రిక **"దిబాల్టిమోర్‌సన్"** ప్రకటించింది. "వాజ్‌పేయికి లభించిన ఇంతటి ఘనస్వాగతం ఎవరికీ లోగడ లభించినట్లు నేను ఎప్పుడూ చూడలేదు. గత 20 ఏళ్ళుగా నేను కాంగ్రె కో ఉన్నాను. వాజ్‌పేయివలె ఒక విదేశాధిపతి, పలువురు అమెరికా కాంగ్రెసు సభ్యులతో చర్చలు జరపటం కూడా నేను ప్రపంచంలో ఎక్కడా చూడలేదు. వాజ్‌పేయిని కలవడానికి యిక్కడ అందరూ ఉత్సుకతను చూపుతున్నారు" అని డెమోక్రటిక్ సభ్యుడు **'సామ్‌గెజ్‌డ్‌సన్'** ప్రశంసించాడు. రెండు దేశాల మధ్య సహకార సంబంధాలతో కొత్తయుగం ప్రారంభం కావాలని, ముఖ్యంగా ఉన్నత సాంకేతిక పరిజ్ఞానం, తీవ్రవాదం, మాదకద్రవ్యాల అక్రమరవాణాలపై కలిసికట్టుగా పోరాడాలని వాజ్‌పేయి పిలుపు యివ్వడం పట్ల హర్షమును వెలిబుస్తూ, డెమోక్రటిక్ బృందానికి ఉపాధ్యక్షునిగా ఉన్న, **రాబర్ట్‌మెనెండెజ్**, "వాజ్‌పేయి అమెరికా సందర్శన, ప్రభుత్వంతో చర్చలు జరపటం వలన ఉభయ దేశాల మధ్య సంబంధాలను మరింత పెంచాయి. అతిపెద్ద ప్రజాస్వామ్యదేశంగా భారత్ దక్షిణాసియాలోను, యావత్ ప్రపంచంలోనూ ప్రముఖ పాత్ర వహించగలదు." అని ప్రశంసాజల్లులు కురిపించాడు. "వాజ్‌పేయి పర్యటన, కాంగ్రెసులో ఆయన చేసిన ప్రసంగం, ఇరుదేశాల మధ్య మిత్రత్వం, సహకార సంబంధాలు మరింత పటిష్టం కావడానికి తోడ్పడుతాయి" అని మరో డెమోక్రాట్ సభ్యుడు **"జాన్ శాకోవిస్కీ"** అభిప్రాయపడ్డాడు. "అమెరికా కాంగ్రెస్‌లో వాజ్‌పేయి చేసిన ప్రసంగం ఉభయదేశాల సంబంధాలలో మరో మైలురాయి" అని వాషింగ్టన్ డెమోక్రాట్ సభ్యుడు **"జిమ్‌మెక్ డెర్మాట్"** కొనియాడారు. భారత విధానాలను తరుచుగా విమర్శిస్తుండే సెనేట్ విదేశీ వ్యవహారాల కమిటీ ఛైర్మన్ 'జెస్సీహెల్మ్' వాజ్‌పేయిని సాదరంగా పలుకరించి, సెనేట్‌కు రమ్మనమని ప్రత్యేకంగా, గౌరవంగా ఆహ్వానించారు. అయితే సమయాభావం వలన ఆయన ఆహ్వానమును మన్నించలేక పోయారు. అయితే వీరి చర్చలు ప్రధానంగా భారత్-అమెరికా ఆర్థిక, రాజకీయ సంబంధాలను పటిష్టపరచడం అన్న అంశముపైననే కొనసాగాయి. అమెరికా కాంగ్రెసు సభలో వాజ్‌పేయి ప్రసంగానికి భారతీయ పూజారి **సముద్రాల వెంకటాచలపతి** ప్రార్థనతో ప్రారంభమైంది. అమెరికా కాంగ్రెసులో భారతీయ పూజారితో ప్రార్థన చేయించటం చరిత్రలో ఇదే ప్రథమం. ఈ సంఘటనకు డెమోక్రాటిక్ కాంగ్రెస్ సభ్యుడు **'షరద్‌బ్రౌన్'** తన ఆనందమును ప్రకటిస్తూ "ఈ వేళ భారత్-అమెరికా సంబంధాల చరిత్రలో చిరస్మరణీయమైన రోజు" అని చెప్పాడు. వాజ్‌పేయి ప్రసంగాలు అమెరికా పత్రికలను విశేషంగా ఆకర్షించాయి. "ఆరేళ్ళ క్రితం అమెరికా సందర్శించిన అప్పటి భారత ప్రధాని పి.వి. నరసింహారావు సోవియట్ విధానాల దృష్టినించి మాట్లాడితే, నేడు వాజ్‌పేయి ప్రసంగం అందుకు పూర్తి భిన్నమైన ధోరణిలో సాగింది. అమెరికా ప్రభుత్వం కూడా ప్రపంచంలో అతి పెద్ద ప్రజాస్వామ్య దేశమైన భారత్‌తో సన్నిహిత సంబంధాల కోసం తహతహ లాడుతున్నది.' అని **'బాల్టిమోర్‌సన్'** అనే పత్రిక పేర్కొంది. జమ్మూ కాశ్మీర్‌లో భద్రతాదళాలు మానవహక్కులను భారీగా ఉల్లంఘిస్తున్నాయని ఆరోపిస్తూ, ఈ విషయాన్ని భారత ప్రధానితో చర్చించాలని **'అమ్నెస్టీ ఇంటర్ నేషనల్'** అనే సంస్థ క్లింటన్‌ను అభ్యర్థించింది. ఐక్యరాజ్య సమితి భద్రతా మండలిలో శాశ్వత సభ్యత్వం పొందడానికి భారత్‌కు యోగ్యతలున్నాయని అమెరికా గుర్తించింది. ప్రెసిడెంట్స్ నేషనల్ సెక్యూరిటీ కౌన్సిల్ సీనియర్ డైరక్టర్ **'బ్రూస్‌రీడెల్'**, విదేశాంగ శాఖ సహాయమంత్రి **'కార్ల్ ఇండర్‌ఫర్త్'**లు ఈ విషయమును వైట్‌హౌస్‌లో ఏర్పాటు చేసిన విలేఖరుల సమావేశంలో కూడా ప్రకటించారు. అమెరికా అధ్యక్ష ఎన్నికలలో **జార్జిబుష్** ఎన్నికైతే భారత్-అమెరికా మధ్య సైనిక సంబంధాలతో సహా అన్నిరకాల ద్వైపాక్షిక సంబంధాలను మెరుగు పరుచుకొనేందుకు ప్రయత్నిస్తామని రిపబ్లికన్ పార్టీ వర్గాలు కూడా తెలపటం ఎంతో ముదావహం. అమెరికా ప్రస్తుత ఉపాధ్యక్షుడు, డెమోక్రాటిక్ పార్టీ అధ్యక్ష అభ్యర్థి అయిన **'అల్‌గోర్'**, వాజ్‌పేయి గౌరవార్థం యిచ్చిన విందులో మాట్లాడుతూ భారతదేశంతో సంబంధాలు ఎప్పటిలా నిరంతరంగా సుహృద్భావంతో కొనసాగేందుకు

తాను కృషి చేస్తానని, ప్రజాస్వామ్యాలకు పెను సవాలుగా నిలుస్తున్న తీవ్రవాదం విషయంలోను, అణువ్యాప్తిని అడ్డుకోవటంలోను భారత్ అభిప్రాయములను తాము అర్థం చేసుకోగలమని, భారత్‌తో కలిసికట్టుగా కృషి చేసేందుకు తాముసిద్ధమని ప్రపంచంలో వాజ్‌పేయి వంటి నాయకులు చాలా అరుదుగా కనపడతారని, ఆయన రాజకీయాలను, కవిత్వాన్ని మేళవించి ప్రజలను ఉత్సాహ పరచగల సమర్థుడని ప్రస్తుతిస్తూ **"కవిగా మీ ప్రజల సృజనాత్మకతను మీరు తట్టిలేపారు. ప్రధానిగా మీరు ప్రజాస్వామ్యం, ఐక్యతవంటి భావనలను మీ ప్రజలు గమనించేందుకు ఎనలేని కృషి సలిపారు"** అని వాజ్‌పేయిని **'ఆల్‌గోర్'** కొనియాడారు. రిపబ్లిక్ పార్టీ అధ్యక్ష అభ్యర్థి **'జార్జిబుష్'** వాజ్‌పేయితో ఫోన్‌లో సంభాషిస్తూ, భారత్-అమెరికా సంబంధాలకు తమ విదేశాంగ విధానంలో అత్యంత ప్రాధాన్యత యివ్వాలన్నదే తన లక్ష్యమని స్పష్టం చేశారు. వీరిరువురూ ఎన్నికలలో ప్రత్యర్థులుగా హోరా హోరీగా పోరాడుతూ కూడా భారత్‌తో సత్సంబంధాల విషయంలో **'ఒకేమాట'** మాట్లాడుతుండటం అమెరికా చరిత్రలో ఏకకాలంలో సంభవించిన తాజాపరిణామమని అనేకమంది పరిశీలకులు భావిస్తున్నారు.

క్లింటన్ తన ఎనిమిదేళ్ళ అధ్యక్ష పదవీకాలంలో ఏ విదేశీనేతకూ ఇవ్వనటువంటి భారీ విందు వాజ్‌పేయి గౌరవార్థం ఇవ్వటం విశేషం. అదో అపూర్వ సన్నివేశం. భారత్-అమెరికా చరిత్రలో శాశ్వతంగా సువర్ణాక్షరాలతో లిఖించవలసిన సుదినం, ఇరుదేశాల మైత్రీవనంలో విరబూసిన కుసుమం. అమెరికా అధ్యక్షుడు క్లింటన్ అత్యంత ఆప్యాయంగా భారత ప్రధాని వాజ్‌పేయి కోసం ప్రత్యేకంగా వైట్‌హౌస్‌లో ఏర్పాటు చేసిన వీడ్కోలు విందు అదే. ఆ విందులో క్లింటన్ ప్రసంగిస్తూ "భారత్-అమెరికాలు రెండూ కలిసికట్టుగా పనిచేస్తే ప్రపంచరూపు రేఖలే మారిపోతాయి. వాజ్‌పేయి చూపిన చొరవ, నాయకత్వలక్షణాల భూమికగా మేము ఇప్పుడు భారత్‌తో సంబంధాలు, ఇంతవరకు ఎన్నడూ లేనంతటి పటిష్టమైన, పరిణతి చెందిన సన్నిహితత్వాన్నీ, భాగస్వామ్య సంబంధాన్నీ నిర్మించాం" అని అన్నారు. క్లింటన్ ఇచ్చిన విందుకు ధన్యవాదాలు చెబుతూ వాజ్‌పేయి "ఇవాళ పరిస్థితి చాలా మారిపోయింది. మనం ఒకళ్ళతో ఒకళ్ళం సంభాషించుకునే తీరు, వైఖరి, దృక్పథం, అన్నీ సమూలంగా మారిపోయాయి. ఈ ఏడాది మనరెండు దేశాలూ, ముందెన్నడూ లేనంతగా గాఢంగా దగ్గరయ్యాయి. ప్రపంచంలోనే అతిపెద్ద, ఉత్కృష్టమైన ప్రజాస్వామ్యాలు రెండూ అతి చేరువయినాయి. మనం ఇప్పుడు కాలపరీక్షకు తట్టుకొని, చిరకాలం నిలబడే సంబంధాన్ని సృష్టించుకున్నాం" అని హర్షం ప్రకటించారు.

వాషింగ్టన్ నడిబొడ్డున మహాత్మాగాంధీజీ విగ్రహాన్ని ఆవిష్కరిస్తూ వాజ్‌పేయి "ఈ ఆవిష్కరణ సమయంలో మీరు (క్లింటన్) స్వయంగా మాతో కలవటం ఎంతో ఆనందాన్ని యిచ్చింది. దీని విలువను భారత ప్రజలు ఎన్నటికీ మరచిపోరు. ఈ నగరం నడిబొడ్డున ఉన్నగాంధీ స్మృతి చిహ్నం, మన రెండు సమాజాలలో ఉన్న సామరస్యానికి, సామీప్యానికి చక్కటి చిహ్నంగా నిలుస్తుంది" అని ఉప్పొంగిన ఆనందంతో క్లింటన్‌కు ధన్యవాదాలు తెలిపారు. "మీరు ఎంతో కాలంగా పాతుకుపోయిన పట్టింపులను, హద్దులను చెరిపేసి, భారతీయుడి మనోఫలకాలను చేరుకున్నారు. మన మధ్య సంబంధాలు సమూలంగా కొత్త రూపు సంతరించుకుంటాయనటానికి ఇదే నిలువెత్తు సాక్ష్యం. ఈ వేళ మీ విజయమే మా విజయమని మేమంటే, అదేదో 'స్లోగన్' అని భావించే రోజులు గతించాయి. మనం కలిసికట్టుగా నడుస్తున్నాం. ఒకే పడవలో ప్రయాణిస్తున్నాం. మీ విజయమే మావిజయం. కలిసికట్టుగా ప్రపంచగతినే మార్చేస్తాం." అని అత్యంత వినయంగా, గౌరవంగా వాజ్‌పేయిని మనస్ఫూర్తిగా అభినందించారు క్లింటన్.

అమెరికాలో వాజ్‌పేయి కవితాధోరణిలో అత్యంత మృదుమధురంగా చేసిన ప్రసంగాలు అమెరికా ప్రజలను ఎంతగానో ఆకట్టుకున్నాయనటం ఏమాత్రం అతిశయోక్తి కాదు. మృదుమధురంగా చేసిన మందలింపులు, అవసరమైనప్పుడు కఠిన పదజాలంతో చేసిన హెచ్చరికలు, మనదేశవైఖరిని, ఆలోచనలను, ఆశయాలను, లక్ష్యాలను స్పష్టంగా, ధైర్యంగా, నిర్మొగమాటంగా సమయస్ఫూర్తితో ప్రకటించిన తీరు తెన్నులకు అమెరికా అధినేతలు, పత్రికలు సానుకూలంగా స్పందించి అభినందన జల్లులు కురిపించారు, కురిపించాయి. భారతదేశ పరిస్థితినేగాక, మొత్తం దక్షిణాసియా పరిస్థితిని కూడా అత్యంత వివరంగా, విపులంగా, విస్పష్టంగా, అమెరికా కాంగ్రెసు సభ్యులకు కళ్ళకు కట్టినట్లు చూపించడంలో వాజ్‌పేయి కృతకృత్యు

లైనారు. పొంచిఉన్న టెర్రరిజం ప్రమాదాన్ని గురించి హెచ్చరిస్తూ, అది ఉభయ దేశాలకు సమానమేనని చెబుతూ పాకిస్థాన్ నిజస్వరూపాన్ని తేటతెల్లం చేసి, పాక్‌పై దౌత్య విజయాన్ని సాధించారు. అణ్వాస్త్రవ్యాప్తి నిరోధం విషయంలో అటు అమెరికా విధానాలను, విశ్వాసాలను గౌరవిస్తూనే, ఇటు మన భద్రతావసరాలను కూడా అమెరికా దృష్టికి తీసుకొని రావటంలో వాజ్‌పేయి ప్రదర్శించిన, విజ్ఞత, రాజకీయ చతురత ప్రశంసనీయమైనది. వాజ్‌పేయి చేసిన ప్రసంగాలు దౌత్యపరిణతికి నిలువుటద్దాలనటం అతి శయోక్తి ఏమాత్రం కాదు.

వాజ్‌పేయి ఇంతటి ఘనకార్యాలను సాధించి ప్రశంసలనందుకుంటుంటే, చూచి ఓర్వలేక, అసూయతో, ద్వేషంతో వాజ్‌పేయి దిగజారి మాట్లాడాడని పాకిస్థాన్ సైనిక పాలకుడు **'పర్వేజ్ ముషారఫ్'** విమర్శించడం కడు శోచ నీయం. వాజ్‌పేయి యాత్ర విఫలమైందని స్వదేశంలోని కొన్ని రాజకీయ పక్షములు విమర్శనలు చేయటం అత్యంత విచారకరం. విమర్శనలు చేయవచ్చును. కాని అవి సద్విమర్శనలు కావాలి. మంచిని ప్రశంసించటం, చెడును విమర్శించటం నేర్చుకోవాలి. అప్పుడే అట్టి సద్విమర్శనలను ప్రజలు సహృదయంతో స్వీకరిస్తారు. అసూయాద్వేషాలతో చేసే దుర్విమర్శనలను విస్మరిస్తారు, విసర్జిస్తారు. ఏది ఏమైనప్పటికీ, ప్రపంచంలోనే అత్యంత శక్తి సామర్థ్యాలుగల సంపన్న దేశంలో పర్యటించి, వారిచేత మన్ననలను అందుకొని వచ్చిన వాజ్‌పేయి నిజంగా ప్రశంసనీయుడే.

భగవాన్ శ్రీ సత్యసాయి బాబావారు, ఒక సారి ఈ అసూయ, ద్వేషములను గురించి వివరిస్తూ **"అసూయకు No reason, No season. భయంకరమైన కాన్సర్ నివారణకు కూడా ఒక ఔషధం ఉన్నది. కాని 'అసూయ' అనే రోగమును నివారించుటకు ఏమాత్రం వీలుకాదు"** అని చెబుతూ ఈ 'అసూయ'కు ద్వేషము, క్రోధము, లోభము అనే బిడ్డలు పుట్టారని, ఈ మూడింటి వలననే సర్వశక్తివంతులు కూడా సర్వనాశనమైనారని చెబుతూ, అసూయ పెరిగి ద్వేషం పెల్లుబికి, లోభంతో ధర్మమూర్తులైన పాండవులకు సూది మొన మోపే స్థలం కూడా యివ్వడానికి నిరాకరించి తనతో పాటు తనకుటుంబాన్నే సర్వనాశనం గావించుకున్నాడు 'దుర్యోధనుడు' అని చెప్పారు. ఈ వాస్తవమును పాలకులు, పక్షాలు గుర్తించి అసూయ, ద్వేషములను విడనాడి, సమైక్యంగా భారత పురోభివృద్ధికి కృషి సలుపుతారని ఆశిద్దాం.

భగవంతునికి అష్టపుష్పములే..... 23వ పేజీ తరువాయి.....

ఆఖరైంది. ఆఖరి పదం 'మమ', మొదటి పదం 'ధర్మ'. మమధర్మం నీ ధర్మాన్ని నీకు బోధించింది భగవద్గీత. అయితే నీ ధర్మమేమిటి? నేను మానవుడను. కనుకనే నేను మానవుడిగా బ్రతకాలి. నేను పశువును కాదు. నేను మనిషిని. కనుక నీవు మానవుడవు కాబట్టి మానవత్వ గుణములను నీలో చేర్చుకో! అయితే ఈనాడు చాలా మంది మానవుడుగా పుట్టి పశువుగా ప్రవర్తిస్తున్నారు. ఇది చాలా తప్పు. మానవుడుగా పుట్టినందులకు మానవ గుణములను అలవరచుకోవాలి. మానవత్వాన్ని పవిత్రం గావించుకోవాలి.

అన్ని జాతులవారికి, అన్ని మతములవారికి, అన్ని దేశములవారికి అహింస, సత్యములు చాలా ప్రీతికరమైనటు వంటివి. సత్యమే లేకపోతే జగత్తే లేదు. కాబట్టి సత్యము చేతనే జగత్తంతా నిలిచి ఉన్నది. ప్రాచీన కాలములోని మహనీయులపేర్లు ఈనాటికీ నిలిచివున్నాయంటే కారణ మేమిటి? వారు చేసినటువంటి మంచి పనులే. కనుక మనం కూడా మంచి పనులు చేయాలి. మంచి పనులంటే ఏమిటి? నీకు ఏది ఇష్టమో, దానినే నీవు ఇతరులకు చేయాలి. నీతో ఎవరైనా అసత్యమాడుతే, నీకు ఎంత బాధకలుగుతుంది? కనుక నీవు కూడా ఇతరులతో అసత్యమాడకూడదు. నీవు ఏది ఆశిస్తున్నావో, దానిని ఇతరులకు పంచి పెట్టు. అదియే నిజమైన ధర్మము. మన ఆత్మను మనం సంతృప్తిపరచుకోవాలి. దేహం కోసంకాదు. మనసుకోసం కాదు. నీ ఆత్మసంతృప్తి కోసం నీవు ప్రయత్నించు. Body is like a Water Bubble, Mind is like a Mad Monkey. Don't follow the Body, Don't Follow the Mind. నీ ఆత్మను నీవు అనుసరించు. భగవంతునికి ప్రీతికరమైనటు వంటివే అర్పించు. భగవంతుని యొక్క ప్రీతిచేతనే నీ జీవితం ధన్యమవు తుంది. కనుక అన్నింటికీ మూలాధారము 'ప్రేమ' ఒక్కటే. కనుక ప్రేమచేతనే మీ జీవితాలను గడపండి.

(ది. 23-8-2000న ప్రశాంతి నిలయంలో భగవాన్ సాయి చేసిన దివ్యప్రసంగము నుండి)

Postal Registered
No.H/M.P.M./34, Dt. 10-12-1984

SREE VANI
OCT 2000

Regd. with Registrar of News
Papers Regd. No. 45039/85



EDITED, PRINTED AND PUBLISHED BY SRI KOMARAGIRI KRISHNA MOHAN RAO
*Printed at Sreevani Offset Printers, Machilipatnam - 521 001 Ph: 21137*